

ప్రెషర్ కుక్కర్స్ డీలర్నైన నేను, ఏది భద్రతగల కుక్కరో ఏది మరింత భద్రతాయుక్తమైనదో చెప్పగలను. అయితే వాటి అన్నింటిలోను అత్యంత భద్రమైనది న్యూ ప్రెస్టీజ్, కనుక మీరు మీ శ్రీమతికి న్యూ ప్రెస్టీజ్‌ని కొనిపెట్టారంటే, మీకు ఆమెపట్ల మిక్కిలి మక్కువ కలదని నిరూపిస్తున్నారన్న-మాట. మరియు ఆమె శ్రేయస్సుకే అత్యధిక ప్రాధాన్యాన్ని యిస్తున్నారన్న మాట-సర్వదా.

## న్యూ ప్రెస్టీజ్ ఎంత భద్రమైనదో చూడండి

100% SAFE

నూటికి నూరుపాళ్ళు భద్రతను చేకూర్చే అద్వితీయమైన గాస్కెట్ రిలీజ్ సిస్టం (జి.ఆర్.ఎస్.) ఒక్క న్యూ ప్రెస్టీజ్‌కి మాత్రమే కలదు. 'వెయిట్ వెంట్' పూడుకొనిపోయినట్లయితే, కుక్కర్ లోపల మితిమించిన ఒత్తిడి ఏర్పడుతుంది.




ఇది కుక్కర్‌కు అత్యంత సమీపములో వున్న వ్యక్తికి ప్రమాదకరంగా పరిణమించవచ్చును.

న్యూ ప్రెస్టీజ్ అయితే, మితిమీరి ఏర్పడిన సీటి ఆవిరి జి.ఆర్.ఎస్‌ను బయటకు నెట్టుతుంది. తత్ఫలితంగా జి.ఆర్.ఎస్. ఆవిరిని భద్రంగా, రూఢిగా క్రిందికి విడిచిపెడుతుంది. గాస్కెట్‌ను ఒక స్పూన్‌తో లోపలికి నెట్టండి.



అంతే, ప్రెషర్ కుక్కర్ తిరిగి వినియోగానికి సిద్ధంగా వుంటుంది. న్యూ ప్రెస్టీజ్ అయితే ఎన్నడూ అణుమాత్రంకూడా ప్రమాదం వుండదు. అందుచేతనే ఎట్టి పరిస్థితులలోనైనప్పటికి అది అత్యంత భద్రమైనది. సర్వదా.

# భార్యపై నిజమైన ప్రేమగలవారు ప్రెస్టీజ్ వద్దని ఎట్లా అంటారు







ప్రెస్టీజ్

TTK తయారీ

న్యూ ప్రెస్టీజ్ ఒక్కటి మాత్రమే 100% భద్రమైనది. న్యూ ప్రెస్టీజ్ ఒక్కదానికి మాత్రమే జి.ఆర్.ఎస్. కలదు.

MAA (S) TTP 3G TEL 85

# చందమామ

సంస్థాపకుడు : 'చ క్ర పా ణి'
సంచాలకుడు : నా గి రె డ్డి

ఈ నెల బేతాళకథ [''కృపాకరుడి కథ'']కు ఆధారం, ''వసుంధర'' రచన.

మనిషిని మానసికంగా, శారీరకంగా పట్టి పీడించే బాధలన్నిటిలోనూ, దారిద్ర్యబాధ అతి భయంకర మైనది. అయినా, దాని నివారణకు నీతిమంతులైన వారెవరూ అసత్యాలకు పాల్పడరు. ఈ వాస్తవం, "ఆలయ ధర్మకర్త'' అన్న కథ ద్వారా తెలుసుకుంటాం.

## అమరవాణి

యో ధ్రువాణి పరిత్యజ్య, అధ్రువాణి నిషేవతే,
ధ్రువాణి తస్య నశ్యంతి, అధ్రువం నష్టమేవచ.

[లభిస్తుందో, లభించదో తెలియని వాటి కోసం ప్రయత్నిస్తూ, తప్పక లభిస్తుందన్న దానిపట్ల అశ్రద్ధ చూపేవాడు, రెండింటినీ కోల్పోతాడు.]

సంపుటి 79 అగస్టు '86 సంచిక 2

విడి ప్రతి : 2–50 : : సంవత్సర చందా : 30–00






CHITRA



కామిక్స్ అన్నది ఇక బోర బోరే
రవి అనుకున్నాడు చెయ్యాలనేదో వేరే వేరే
తనంతట తానే సరదా తీరేలా
ఇతరులు చూసి మురిసి పోయేలా
ఆ! ఈ ఎకో పెన్నులసెట్ నాకు జోడీ
గీసేస్తా నేనింక కూసే ఓ కోడీ
అల్లరి పిల్లల బడి, రెండు జడల జోడి.
నాన్న పెంచే మీసం, అమ్మ చేసే పకోడి.
ఎకో పచ్చ ఎకో నీలం
ఎరుపు పసుపు నారింజ రంగుల మయం
ఊదా, నలుపు, వైలెట్
గులాబీ, గోధుమలతో అయ్యేనది ఓ సెట్




# ఎకో

స్కెచ్ పెన్ రంగులే ఇక రంగులు- సరదాతీర్చే హంగులు!

ప్రిసిషన్ రైటింగ్ పాయింట్స్ (ప్రైవేట్) లిమిటెడ్, 18, సుభాష్ రోడ్, విలే పార్లే (ఈస్ట్), బొంబాయి 400 057.
ఫోన్ : 6040305, 6043556.

## చందమామ కబుర్లు

### వేడి నిచ్చే పశువులు



పశ్చిమ జర్మనీకి చెందిన ఇంజనీర్లు—పశువుల శరీరంలోని వెచ్చదనం నుంచి వేడిని పుట్టించవచ్చని కనుగొన్నారు. అరటన్ను బరువు గల పశువు నుంచి, 1,200 వాట్స్ వేడి పుట్టించవచ్చనీ, ఇరవై పశువుల నుంచి జనించే వేడి ద్వారా సంవత్సరానికి దాదాపు 3,300 లీటర్ల ఇంధనం నూనెను పొదుపు చేయవచ్చనీ వాళ్ళు అభిప్రాయ పడుతున్నారు।

### అతి ప్రాచీనమైన శిలాచిత్రం



పురాతత్త్వ శాస్త్రజ్ఞులు ఇటీవల టాస్మానియాలో 14,000 సంవత్సరాల నాటి ఒక శిలా చిత్రాన్ని కనుగొన్నారు. ప్రపంచంలో కెల్లా ఇదే అతి ప్రాచీనమైన శిలా చిత్రంగా భావించబడుతున్నది.

### ఎత్తయిన మనుషులు



ప్రపంచంలో ప్రస్తుతం డచ్ దేశస్థులే ఎత్తయిన వారుగా ఉంటున్నారు. గత ఇరవై సంవత్సరాలలో, సగటు పురుషుల ఎత్తు 4. సెం. మీ. పెరిగి—1.68 మీటర్ల వరకూ ఎదిగినట్లు పరిశోధనల ద్వారా వెల్లడయింది.

### విజన్ టెలిఫోన్



చెవిటి వాళ్ళకూ, మూగ వాళ్ళకూ ఉపయోగపడే విధంగా, విజన్ టెలిఫోన్ రూపొందించబడి ఉన్నది. తెర నుంచి తెరకు సైగలను ప్రసారం చేసే విధానం ద్వారా విజన్ టెలిఫోన్ పనిచేస్తుంది।

పురాణగాథలు :

# ఇందుమతి

పూర్వం ఒకప్పుడు తృణబిందు అనే ఋషి చిరకాలం ఘోర తపస్సు చేశాడు. ముని తపస్సు ఫలిస్తే, తన పదవికి ముప్పు వాటిల్లగలదన్న భయంతో ఇంద్రుడు, తృణబిందుడి తపస్సుకు భంగం కలిగించమని హరిణి అనే అప్సరసను పంపాడు.

హరిణి తృణబిందుణ్ణి సమీపించి, తన ఆటపాటలతో ఇంద్రుడి ఆజ్ఞ నెరవేర్చడానికి ప్రయత్నించింది. ఆమె ఉద్దేశాన్ని పసి గట్టిన తృణబిందుడు, ఆగ్రహం చెంది, "తుచ్ఛమైన మానవ స్వభావంతో ప్రవర్తించిన నువు, మనిషిగా పుట్టు!" అని శపించాడు.

అపరాధం క్షమించి, శాపాన్ని ఉపసంహరించమని హరిణి, మునీశ్వరుణ్ణి వేడుకున్నది.

తృణబిందుడు కొంతసేపటికి శాంతించి, "పారిజాతహారం నీ మెడను స్పృశించిన వెంటనే నీకు శాపవిముక్తి కలుగుతుంది," అన్నాడు.

ముని శాప ప్రభావంతో, హరిణి భోజరాజు కడుపున ఇందుమతిగా జన్మించింది. స్వయం వరంలో అయోధ్యరాజయిన అజుణ్ణి వివాహమాడింది.

ఒకనాడామె ఉద్యానవనంలో విహరిస్తూండగా, మేఘాల మాటు నుంచి ఒక పుష్పహారం గాలిలో తేలుతూ కిందికి రావడం ఆమె కంట బడింది. ఆకాశంలో వెళుతూన్న నారదుడి వీణ నుంచి జారిన ఆ సుర పుష్పమాల, ఆమె మెడలో పడింది.

ఇందుమతి ఆశ్చర్యంతో పారిజాతహారం కేసి చూసింది. మరుక్షణమే ఆమె స్పృహ తప్పి కిందపడి, మానవ దేహాన్ని త్యజించి, దేవలోకం చేరుకున్నది.





# కొడుకు బాధ్యత

పార్వతమ్మ అనే ముసలావిడ, వీధుల వెంట తిరిగి బిచ్చమెత్తి బతికేరోజుల్లో, ఆరేళ్ళ అనాథ బాలుడుగా అనంతుడు, ఆమెకు దొరికాడు. వాడికి చదువు మీద వున్న ఆసక్తి గమనించిన పార్వతమ్మ, తాను బిచ్చమెత్తి సంపాయించిన డబ్బులో కొంత మిగిలిస్తూ, వాడికి చదువు చెప్పించింది.

అనంతుడు ఇరవైఏళ్ళవాడై చదువు పూర్తిచేసి ఉద్యోగం సంపాయించుకున్నాడు. ఆ తర్వాత ఒక మంచి ఇల్లు అద్దెకు తీసుకుని, అందులో ప్రవేశించాడు. పార్వతమ్మ ఇక తన కష్టాలు తీరిపోయినట్టు, చాలా ఆనందపడింది.

ఆ పరిస్థితుల్లో, తమ పిల్లనిస్తామంటూ కొందరు ఆడపిల్లల తండ్రులు ఆతడి ఇంటికి రాసాగారు. అలా వచ్చిన సంబంధాల్లో, తనకూ, తనను పెంచి పెద్దచేసిన అవ్వ పార్వతమ్మకూ నచ్చిన ఒక అమ్మాయిని, అనంతుడు పెళ్ళి చేసుకున్నాడు. ఆమె పేరు అమల.

అమలకు తను కాపరానికి వచ్చిన రోజునుంచీ, భర్తతోపాటు ఒకనాటి బిచ్చగత్తెకు వండి వడ్డించడం చెప్పలేనంత కంపరంగావుండేది. భర్త ఇంటలేనప్పుడు, ఆమె పార్వతమ్మను చీదరించుకుంటూ సూటీ పోటీ మాటలు అనేది. అయినా, ఇలాంటివాటికి ఎంతో కాలంగా అలవాటు పడిపోయిన పార్వతమ్మ, అంతగా బాధ పడేది కాదు.

ఈ పరిస్థితుల్లో, వృద్ధాప్యానికితోడు, ఆమె అనారోగ్యానికి గురి అయింది. అనంతుడికి ఆమెను గురించిన చింత పట్టుకున్నది. ఆమె వద్దంటున్నా వినక, వైద్యం కోసం డబ్బు ఖర్చుచేయసాగాడు. అమలకు ఇదేమాత్రం యిష్టం లేదు.

మాచిరాజు కామేశ్వరరావు

ఒకనాడామె భర్తతో, "పండగ ఇంకా వారం రోజులే వున్నది. మీరు, నాకు పట్టు చీర కొనిపెట్టి చాలా కాలమైంది. పండగకు ఒక పట్టుచీర కొనండి," అన్నది.

అనంతుడు కొంచెంసేపాలోచించి, "పండగలకేం, దీని తర్వాత మరొక పండగ రాకపోదు. నువ్వూ చూస్తున్నావు గదా—అవ్వ వైద్యానికి చాలా ఖర్చు పెట్టవలసివస్తున్నది," అన్నాడు.

ఆ జవాబు వింటూనే, అమల ఎక్కడలేని కోపం తెచ్చుకుని, "ఒక బిచ్చకత్తె కోసం అంత డబ్బు ఖర్చుపెట్టడం, బుద్ధిమంతులు చేసే పనేనా?" అని అడిగింది.

అనంతుడు ఒక క్షణకాలం నివ్వెరపోయి, "అవ్వను గురించి అంత చులకనగా, మరెన్నడూ మాట్లాడకు!" అని బయిటికి వెళ్ళిపోయాడు.

దానితో అమలకు, పార్వతమ్మపట్ల ద్వేషం రెట్టింపయింది.

ఆ రాత్రి భోజనాలయాక ఆమె, భర్తతో, "నేను పగలంతా ఎంత క్షోభపడిపోయానో, మీకు తెలియదు. మీరు బాగా ఆలోచించి, నేను కావాలో లేక, ఆ బిచ్చగత్తే కావాలో తేల్చుకోండి!" అన్నది.

ఆ మాటలకు అనంతుడు ఆవేశపడిపోతూ, "బిచ్చగత్తె అనవద్దని లోగడ చెప్పాను. నీది వట్టి కుళ్ళుబుద్ధి. భర్తగా నిన్ను సంతోషపెట్టవలసిన బాధ్యత నాకు తెలుసు. అయితే, అనాథనైన నన్ను



పెంచి పెద్దచేసిన అవ్వపట్ల, నాకు బాధ్య తంటూ లేదా? ఇంతటితో నోరు మూసుకో,'' అన్నాడు.

అమల ఆనాటి తెల్లవారుజామున, తను వెళ్ళిపోతున్నట్టు ఒక ఉత్తరం రాసి, నిద్రపోతున్న భర్త తలదిండు కిందపెట్టి, బాడుగబండిలో పుట్టింటికి వెళ్లి పోయింది.

హఠాత్తుగా వచ్చిన అమలను చూసి, ఆమె తండ్రి, ''ఇలా ఒక్కదానివే వచ్చావేం?'' అని అడిగాడు.

ఆమె జరిగినదంతా తండ్రికి చెప్పి, ''నాకన్నా ఆయనకు, ఆ ముసలి బిచ్చగత్తే ఎక్కువట. ఆ ఇంట్లో ఒక క్షణం కూడా వుండలేక వచ్చేశాను,'' అన్నది.

ఆమె తండ్రి కొంచెం సేపు తలాడిస్తూ వూరుకుని, ''మంచి పని చేశావు. భార్య పట్ల తన బాధ్యత ఏమిటో గ్రహించిన నాడు, అతనే వస్తాడు,'' అన్నాడు.

తండ్రి మాటలు విని అమల చాలా సంతోషించింది. అయితే, ఆమె అన్న మాత్రం పలకరించనైనా పలకరించకుండా బయటికి వెళ్ళిపోవడం, ఆమెకు చాలా బాధకలిగించింది.

తర్వాత కొంతసేపటికి ఆమె తండ్రి కచేరీకి వెళుతూ, ''జరిగిందేదో జరిగి పోయింది! నేను చీకటి పడకుండా వచ్చేస్తాను,'' అన్నాడు.

అయితే, ఆ రోజు బాగా చీకటి పడి పోయాక కూడా తండ్రి ఇంటికి రాకపోవ





డంతో, అమల ఆదుర్దాపడి, తండ్రితో పాటు కచేరీలో ఉద్యోగం చేసే ఎదురింటి రామయ్య దగ్గిరకు వెళ్ళి, "ఏం, బాబాయ్! మా నాన్న ఇంకా రాలేదేం?" అని అడిగింది.

"నీకు చెప్పడానికి మనస్కరించక పూరుకున్నాను. ఈ సాయంత్రం, మీ నాన్న లంచం పుచ్చుకుంటూ దొరికి పోయాడు. నిలవడం కష్టం—ఉద్యోగం పోయినట్టే!" అని చెప్పాడు రామయ్య.

ఈ వార్త విని అమల నిలువెల్లా వణికి పోయింది. లంచం కారణంగా ఉద్యోగం పోవడం అంటే, దానితోపాటు పరువూ పోయినట్టే!

అమల ఇలా ఆలోచిస్తూ, ఇంటికి తిరిగి వచ్చేసరికి పెరట్లో ఏదో అలికిడైంది. ఆమె అక్కడికి వెళ్ళేసరికి, తండ్రి నూతి పళ్ళెం మీద ఏదో కాయితం పెట్టి వెళ్ళి పోతున్నాడు. అమల గబగబా పోయి, అతడి చేయి పట్టుకున్నది.

"ఇక ఎవరికీ, నా ముఖం చూపెట్ట లేను, తల్లీ! నా దారిన నన్ను పోనీ," అన్నాడు అమల తండ్రి.

"అదేం మాట, నాన్నా! లోపలికి రా," అన్నది అమల వచ్చే దుఃఖాన్ని అపుకుంటూ.

"ఈ వయసులో ఉద్యోగం పోయిన నా బతుకు ఎలా గడుస్తుంది," అన్నాడామె తండ్రి బాధగా.

"దిగులుపడకు, నాన్నా! నీ ఉద్యోగం పోయినా, అన్నయ్య ఉద్యోగం ఉన్నది. కొడుకుగా నిన్ను పోషించవలసిన బాధ్యత అన్నయ్యకు లేదా?" అన్నది అమల.

ఆ సమయంలో పెరటి తలుపు తెరిచి అక్కడికి వచ్చిన, అమల అన్నయ్య, ఆమెతో, "ఆ బాధ్యత విషయం తర్వాత చెబుతాను, ముందు ఈ సంగతి చెప్పు, అమలా! కాళ్ళూ, చేతులూ బావుండి, గౌరవనీయమైన ఉద్యోగం చేసుకుంటున్న నాన్న, లంచం తీసుకోవడం, నీకు అసహ్యం కలిగించడం లేదా?" అన్నాడు.

''దైవసాక్షిగా, నాన్న మీద అలాంటి అసహ్యభావం నాకు ఏమాత్రం లేదు,'' అన్నది అమల.

ఆ జవాబుకు ఆమె అన్న నవ్వి, ''లంచం తీసుకోవడంలాంటి, అతి నీచమైన పని చేసిన నాన్న అంటే, నీకు అసహ్యం కలగడం లేదు. కాని, అంగవైకల్యం వల్ల, మరో దారి లేక బిచ్చగత్తెగా మారిన పార్వతమ్మ అంటే, నీకు అసహ్యం! ఎటువంటి నేరం చేసినవాడైనా, తండ్రి గనక పోషించవలసిన బాధ్యత కొడుకుగా నాకున్నదన్నావు,'' అన్నాడు.

''అవును, లేదామరి?'' అని అడిగింది అమల కోపంగా.

''ఆ బాధ్యత నాకున్నదన్న సంగతి, నువ్వు చెప్పనవసరం లేదు. అనాథ అయిన తనను, ఎన్నో శ్రమలకోర్చి పెంచి పెద్ద చేసిన పార్వతమ్మను, ఆమె ముసలితనంలో పోషించవలసిన బాధ్యత అనంతుడికి లేదా? ఆ ఇంటి కోడలుగా, ఆమెను గౌరవిస్తూ, సేవలు చేయడం, నీకు ధర్మంకాదా?'' అని అడిగాడు అమల అన్న.

అమల జవాబేమీ చెప్పలేక కళ్ళనీళ్ళు పెట్టుకుని, ''అన్నయ్యా, నువ్వు నా కళ్లు తెరిపించావు. పొద్దున్నే బయలుదేరి అత్తగారింటికి వెళతాను. నాన్నకు ఉద్యోగం పోతే పోయింది; ఏదైనా శిక్ష కూడా పడుతుందేమో అని, నాకు భయంగా వున్నది,'' అన్నది.

ఆ మాటలకు అమల తండ్రి చిన్నగా నవ్వి, ''నేను లంచమూ తీసుకోలేదు; ఉద్యోగమూ పోలేదు. నీ మేలు కోరి— నీకు బుద్ధి గరపడానికి రామయ్యా, నేనూ, నీ అన్నయ్యా, ఈ చిన్న నాటకం ఆడాం,'' అన్నాడు.

''మీరాడిన, ఈ నాటకం, నాకీ జన్మకు సరిపడా బుద్ధినీ, మంచి చెడ్డలు ఆలోచించగల జ్ఞానాన్నీ ప్రసాదించింది!'' అంటూ అమల సంతోషంగా ఇంట్లోకి వెళ్ళిపోయింది.






# శనిదేవత

బంగారయ్య అనే ఒక గృహస్థు, పొరుగు గ్రామం శిళ్ళంగేరిలో వున్న బంధువుల ఇంటికి వెళ్లి తిరిగి వస్తూ, మార్గమధ్యంలో వున్న, ఒక అడవిదారి వెంట నడుస్తున్నాడు. ఆ సమయంలో అతడికి ఒక చోట, పొదలచాటుగా నక్కిపోతున్న ఒక మనిషి కనిపించాడు. వాడి చేతిలో ఒక మూట వున్నది.

వాడి వాలకం గమనించిన బంగారయ్యకు, వాడు దొంగ అయి వుంటాడన్న నమ్మకం కలిగింది. అతడు ఒక చెట్టు చాటుకు పోయి నిలబడ్డాడు. చేతిలో మూట వున్నవాడు, ఒక పెద్ద చెట్టువద్దకు పోయి, దాని తొర్రలో మూటను జారవిడిచి, అక్కణ్ణించి పరిగెత్తాడు.

ఇది చూసిన తరవాత, బంగారయ్యకు వాడు దొంగ అని ధృవపడిపోయింది. తొర్రలో వున్న, ఆ డబ్బు మూటను తన సొంతం చేసుకుందామనుకుంటూ, అతడు వేగంగా అటు కేసి నాలుగడుగులు వేశాడు. అంతలో అతడి ఊరివాడే అయిన శంకరయ్య, కాలిబాట మలుపు తిరిగి వస్తూ, బంగారయ్య కంటబడ్డాడు.

బంగారయ్య కోపంగా అతడి కేసి చూస్తూ నిలబడ్డాడు. శంకరయ్య అతణ్ణి సమీపిస్తున్నంతలో, ఎక్కడినుంచో మరొకడు చెట్టు దగ్గిరకు వచ్చి, తొర్రలో వున్న మూట తీసుకుని, వెళ్ళిపోయాడు.

ఈ జరిగింది చూసిన బంగారయ్య పెద్దగా నిట్టూర్చి, శంకరయ్యతో, "చూశావా, శంకరయ్యా! అసలు దొంగ, ఆ డబ్బు మూటను చెట్టు తొర్రలో పెట్టి పోవడం, నేను చూశాను. ఎవరికంటా బడకుండా, దాన్ని కాజేద్దామని బయలుదేరేంతలో శనిలా నువ్వు, నా కంటబడ్డావు!" అన్నాడు.

కోలార్ కృష్ణ అయ్యర్

ఆ మాటలకు శంకరయ్య దిగులుగా ముఖం పెట్టి, "దొంగ ఆ డబ్బు మూటను చెట్టు తొర్రలో పెట్టడం, దూరాన్నుంచి నేనూ చూశాను. దాన్ని సొంతం చేసు కుందామని కాలి బాట మలుపు తిరిగి వచ్చేంతలో నువ్వు, శనిదేవతలా నా కంట బడ్డావు. దొంగ సొమ్ము దొంగిలించి పారి పోయినవాణ్ణి, అదృష్టదేవత కరుణించి వుండాలి. మనం ఒకరిపాలిట ఒకరం, శనిదేవతలం!" అన్నాడు.

వాళ్ళిలా మాట్లాడుకుంటూండగా, మంగిపూడి జమీందారుగారి కాపలా నౌకర్లిద్దరు, తొర్రలోంచి మూట ఎత్తుకు పోయిన వాడి చేతులను తాళ్ళతో బిగించి పట్టుకుని అటుగా వచ్చారు.

ఆ కాపలావాళ్ళను బంగారయ్యా, శంకరయ్యా ఎరుగుదురు.

బంగారయ్య, వాళ్ళను, ఏమీ తెలియ నట్టు, "ఎవడు వీడు? ఏం జరిగింది?" అని అడిగాడు.

"వీడు రాత్రి జమీందారుగారి ఇంట్లోని డబ్బూ, నగలూ దొంగిలించి పారిపోయి, ఇక్కడ మాకు పట్టుబడ్డాడు. వీడు ఎంత పొగరుమోతు వెధవంటే—దొంగ సొమ్ముతో పట్టుబడి కూడా, దొంగను నేను కాదంటున్నాడు." అని చెప్పారు కాపలా నౌకర్లు.

శంకరయ్య ఏదో అనబోయేంతలో, దొంగగా పట్టుబడినవాడు లబోమంటూ, "అయ్యా, నా మాట నమ్మండి! నేను



దూరాన చెట్టు కొమ్మల్లో తేనెతుట్టె దులుపుతూ, ఎవడో ఒక మూటను చెట్టు తొర్రలో పెట్టి పరిగెత్తడం చూశాను. ఏదో ఆశకొద్దీ, ఆ మూట నేను తీసుకుని మీకు దొరికిపోయాను. నేను దొంగను కాను,'' అన్నాడు.

ఆ మాట వింటూనే కాపలా నౌకర్లలో ఒకడు, ''ఇక నోరు ముయ్యిరా, దొంగ ముచ్చూ! నువ్వు చెప్పేదాన్నిబట్టి, నీకు తోడుదొంగ మరొక డున్నాడని తెలుస్తున్నది. వాడి అచూకీ మాకిచ్చి, పట్టుబడేలా చెయ్యకపోయావో—నీకు చీకటికొట్టు శిక్షతోపాటు, మండుటెండలో కాలేబండ వీపున ఎత్తిస్తాం,'' అన్నాడు.

దొంగగా పట్టుపడినవాడు మరి మాట్లాడ లేదు. వాళ్ళు ముందుకు సాగిపోగానే బంగారయ్య, శంకరయ్యతో, ''నువ్వు, నా పాలిటి శనిదేవతవు కాదు, శంకరయ్యా, అదృష్టదేవతవు!'' అన్నాడు.

దానికి శంకరయ్య చిరునవ్వు నవ్వి, ''మనం ఇప్పటికి కొన్ని క్షణాలముందు ఒకళ్ళపాలిటి కొకళ్ళం, శనిదేవతలం కావడం వల్లనే, దొంగలుగా పట్టుబడక తప్పించుకున్నాం. ఏదో ఒక విచిత్ర ధోరణిలో, శనిదేవతా మనుషులకు మేలు చేస్తుందన్న నమ్మకం, నాకు కలుగుతున్నది,'' అన్నాడు.

''నువ్వనేదాంట్లో వున్న నిజమెంతో, నాకు తెలియదు. అసలు దొంగ చెట్టు తొర్రలో మూట దాయడం, ముగ్గురం చూశామన్న మాట. తేనెకోసం చెట్టెక్కిన వాడికి, మనిద్దరం కనబడి వుంటే, వాడు మనల్ని శనిగాళ్ళ కింద జమకట్టి వుండే వాడు!'' అన్నాడు బంగారయ్య.

అందుకు శంకరయ్య, ''దొంగిలించిన సొమ్ము దక్కించుకోలేకపోయినా—ఒక విధంగా అసలుదొంగ అదృష్టవంతుడు. వాడికి చీకటికొట్టు శిక్ష తప్పింది,'' అన్నాడు.

తర్వాత ఆ ఇద్దరూ ఏ అరమరికలు లేకుండా, ఉత్సాహంగా కబుర్లు చెప్పుకుంటూ తమ గ్రామం చేరారు.






## 4

[పౌరులు చిత్రసేనుడితో ఉగ్రాక్షుడు తమ పశువులనూ, మనుషులనూ ఎత్తుకుపోతున్నట్టు చెప్పారు. చిత్రసేనుడు, ఉగ్రాక్షుడి కోటకు వెళ్ళాడు. రాజ్యంలో పశువులనూ, మనుషులనూ ఎత్తుకుపోతున్నది జ్వాలాద్వీపం నుంచి వస్తున్న భయంకర మానవులని ఉగ్రాక్షుడు అన్నాడు. వాళ్ళను చూపుతానని అతడు చిత్రసేనుడికి మాట ఇచ్చాడు. తరవాత—]

ఉగ్రాక్షుడు చిత్రసేనుణ్ణీ, అతడి వెంట వచ్చిన పరివారాన్నీ, భటులనూ వెంట పెట్టుకుని వారికి తన కోటలోని వెలలేని రత్నరాసులనూ, వెండి బంగారాలనూ చూపించాడు. ప్రపంచం పుట్టినప్పటి నుంచీ, ఆనాటివరకూ రాక్షసులు వాడిన వివిధ రకాల ఆయుధాలూ, విచిత్రమైన శిరస్త్రాణాలూ చూసి, చిత్రసేనుడు చాలా అబ్బురపడ్డాడు. కాని, అతణ్ణి అన్నిటి కన్న ఆశ్చర్యపరిచింది రాక్షసుడి కోటలో వున్న ధనరాసులు. "ఉగ్రాక్షా! రాక్షసులైన మీకు, ఈ ధన కనకాలతో ఏం పని?" అని అడిగాడు చిత్రసేనుడు.

ఈ ప్రశ్న వింటూనే ఉగ్రాక్షుడు పెద్దగా నవ్వి, "ఏనాటికైనా, మా రాక్షస జాతి నాగరికులై, మీలాగా వర్తక వ్యాపారాలూ, వ్యవసాయప్పనులూ చేయదలిస్తే, వీటిని ఉపయోగించుకుంటారు.

అదొక్కటే కాక, మరో పద్దెనిమిదేళ్ళకు సంభవించనున్న ఒకానొక ముఖ్య సంఘటనను మనసులో వుంచుకుని కూడా, ఈ ధన కనకాలను కోటలో భద్రపరిచాను," అన్నాడు.

పద్దెనిమిదేళ్ళ తరవాతి ముఖ్య సంఘటన అంటూ ఉగ్రాక్షుడు మాట్టాడగానే, చిత్రసేనుడికి, ఇందులో ఏదో మోసం వున్నదన్న అనుమానం కలిగింది. అయినా, తన అనుమానాన్ని రాక్షసుడు పసికట్టేలా ప్రవర్తించటం మంచిది కాదు. తను పద్దెనిమిదేళ్ళ తర్వాతో ఎప్పుడో, నిజంగా తన కొడుకును అతడి పరం చేస్తానని, వాడు నమ్మితే నమ్మనీ అనుకున్నాడతడు.

చిత్రసేనుడు రాక్షసుడి కోటలోని అద్భుతాలన్నీ చూసేలోపల సూర్యాస్తమయమయింది. ఉగ్రాక్షుడు, తన అతిథికీ, అతడి అనుచరులకూ గొప్ప విందు చేశాడు. విందు మధ్యలో ఉగ్రాక్షుడి సేవకుడొకడు, యజమాని దగ్గిరకు వచ్చి, "ప్రభో! జ్వాలాద్వీపవాసులు ఎక్కవచ్చే భయంకర పక్షి ఒకటి కుంభికుప్ప ప్రాంతంలో కనిపించింది. అక్కడ కాపలావాళ్ళు మంటలు వేసి, ఆ సంగతి తెలియపరిచారు," అన్నాడు.

సేవకుడి మాటలు వింటూనే ఉగ్రాక్షుడు అదిరిపడి, "చిత్రసేనా! మనం త్వరగా బయలుదేరటం మంచిది. నీ రాజ్యంలో ప్రజలను ఎత్తుకుపోయే,



మహా క్రూరుల్ని నీకు చూపెడతాను,'' అన్నాడు.

అందరూ క్షణాలమీద భోజనాలు చేసి ఉగ్రాక్షుడి వెంట బయలుదేరారు. ఉగ్రాక్షుడు, తన వెంట చిత్రసేనుణ్ణీ, కొద్దిమంది ఆయుధధారులైన తన సేవకుల్నీ తీసుకుని తతిమ్మావారిని, తన అనుచరుల వెంట మరో దిక్కుగా పంపాడు.

ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ కోట వదిలి తూర్పు దిక్కుగా కొంతదూరం అడవిలో నడిచేసరికి, హఠాత్తుగా కోట వైపు నుంచి పెద్ద రెక్కల చప్పుడూ, కీచుమనే వికృత ధ్వనులూ వినిపించాయి. అందరూ చెట్లమధ్య ఆగి కోటకేసి చూశారు. కోటమీద వలయాకారంగా రెక్కలు చాచిన కొన్ని వింత ఆకారాలు ఎగురుతున్నవి. కోట రక్షకులైన రాక్షసులు పొడుగాటి దివిటీలు గాలిలోకి ఎత్తి, కేకలుపెడుతూ అవి కిందికి దిగకుండా భయపెడుతున్నారు.

''ఉగ్రాక్షా! ఈ వికృతాకారాలు భయోత్పాతం కలిగించేలా వున్నవే! అవి నీ కోటమీద దిగి, దాన్ని ఆక్రమించుకోవాలని ప్రయత్నిస్తున్నవా?'' అన్నాడు చిత్రసేనుడు.

''జ్వాలాద్వీప వాసులు, అలాంటి ప్రయత్నం లోగడ ఒకటి రెండుసార్లు చేశారు. కాని, నా సేవకులు పెద్దపెద్ద కాగడాలూ, ఈటెలూ ఉపయోగించి,





లతో రెండు పక్షులు, అల్లంత ఎడంలో కిందికి దిగినై. వాటి వీపులమీదినుంచి, పులి చర్మాలు ధరించిన నలుగురు మనుషులు దిగారు.

వెంటనే ఉగ్రాక్షుడు, చిత్రసేనుణ్ణీ తన అనుచరులనూ వొత్తుగా వున్న చెట్ల మాటుకు తీసుకుపోయాడు. వింత పక్షుల నుంచి దిగిన మనుషులు నేలబారున పడుకుని చుట్టూ చెట్లలోకి కొద్దిసేపు జాగ్రత్తగా పరీక్షించి చూసి, తరవాత లేచి ఏమో సంప్రతించుకుని, ముందుకు నడిచారు. వారి వెనకగా రెక్కలల్లాడిస్తూ పక్షులు బయలుదేరినై.

ఆ భయంకర పక్షులపై స్వారీ చేస్తున్న ఒకణ్ణి కింద పడగొట్టారు. వాణ్ణి గానుగకు కట్టి నాలుగైదు చుట్లు తిప్పేసరికి, తను ఎక్కడినుంచి వచ్చిందీ చెప్పాడు. కాని, తతిమ్మా వివరాలు తెలుసుకునే లోపలే వాడు చావటం జరిగింది. ఇప్పుడు, వాడి అనుచరులు నామీద పగ తీర్చుకునేందుకు ప్రయత్నిస్తున్నారు. అంతే. వాళ్ళు సాహసించి కోటలో దిగరని నా నమ్మకం,'' అన్నాడు ఉగ్రాక్షుడు.

ఉగ్రాక్షుడు మాటలు ముగించీ ముగించకముందే, ఆ చుట్టుపట్ల గల చెట్టు చేమలు గాలికి వూగిపోయినై. ఆ వెంటనే గుండెలవిసేలాంటి భీకర ధ్వను

నిజానికి రెక్కలున్నా వాటిని పక్షులనేందుకు వీల్లేదు. వాటి ముక్కులు దాదాపు మూడడుగుల పొడవున్నవి. ముక్కులు తెరిచినప్పుడల్లా, వాటి నోళ్ళలో పులికోరల్లాంటి పళ్ళున్నవి. శరీరం మీద ఎక్కడా ఈకలు లేవు. జంతువులకున్నట్టు వాటికి చిన్న తోక ఒకటి వున్నది. అవి పక్షులలాగే రెండు కాళ్ళ మీద కొంచెం ముందుకు వంగి నడుస్తున్నవి. వాటి ఎత్తు ఏడెనిమిది అడుగు లుంటుంది.

''నిజమైన ప్రమాదం ఆ పులిచర్మంగాళ్ళ నుంచి కాదు. ఈ వింత పక్షుల నుంచి. అవి వాళ్ళకు వాహనాలుగానూ,

రక్షకులుగానూ పని చేస్తవి. ఎవరైనా ఆ క్రూరుల్ని ఎదుర్కొంటే, ముందుగా వచ్చి మీద పడేవి ఈ పక్షులు. రకరకాల ఈలలతో వాటిని తమ శత్రువుల మీదికి ఆ పులిరాయుళ్ళు ఉసికొల్పుతారు. నా సేవకుల్లో కొందర్ని ఈ పక్షులు తమ ముక్కుల్తో, కాలి గోళ్లతో చీల్చి ముక్కలు ముక్కలుగా చేసినై,'' అన్నాడు ఉగ్రాక్షుడు.



ఉగ్రాక్షుడు ఇలా మాట్లాడుతున్నంతలో, వింతపక్షుల మీద నుంచి దిగినవాళ్ళు మెల్లగా ఈలలు వేస్తూ, చెట్లలోకి నడవసాగారు. పక్షులు రెండూ ఒకసారి ముక్కులు పైకెత్తి రెక్కలాడించి వాళ్ళ వెనకగా కదిలినై.

''అదుగో, ఆ కొండ పాదంలో వున్న గూడెంకేసే వీళ్ళ ప్రయాణం. మరి కొందరు నీ పౌరులు మాయమవబోతున్నారు,'' అన్నాడు ఉగ్రాక్షుడు.

''అయితే, మనం చూస్తూ వూరుకోవలసిందేనా?'' అన్నాడు చిత్రసేనుడు.

''అఁ, అంతకన్న చేసేదేముంది? వాళ్ళ వెంట ఆ భయంకర పక్షులుండగా, మనం చెయ్యగలిగిందేమీ లేదు. ఆ ద్వీపవాసులు ఒంటరిగా దొరికితే, నా బొటనవేలుతో నొక్కి చూర్ణం చూర్ణం చేయగలను,'' అన్నాడు ఉగ్రాక్షుడు కోపంగా.

ఇంతలో ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ నిలబడి వున్న చెట్టు మీది నుంచి చెవులు గింగుర్లెత్తేలా గుడ్లగూబ ఒకటి అరిచింది. ఆ అరుపు వింటూనే, పులిరాయుళ్ళు చప్పున వెనుదిరిగారు. వాళ్ళ చేతుల్లోని బరిసెలు చీకట్లో తళతళ మెరిసినై. భయంకర పక్షులు కూడా పెద్దగా ముక్కులు తెరిచి, వికృతంగా కూతపెట్టినై.

''ఇక్కడెవరో వున్నట్టు వాళ్ళు పసిగట్టారు!'' అన్నాడు ఉగ్రాక్షుడు. ఆ వెంటనే తన సేవకుల్ని దగ్గిరకు పిలిచి, రహస్యంగా ఏమో చెప్పాడు. వాళ్ళు రెండు ముఠాలుగా చీలి వెళ్ళిపోయారు. మరుక్షణం భయంకర పక్షులు ముక్కులు



నులు, గుండె లదిరేలా అరుస్తూ, వెనక నుంచి రెండు ముఖాలుగా వచ్చి, పులి చర్మాలు ధరించిన వాళ్ళ మీద పడ్డారు. ఇదే అదనుగా చిత్రసేనుడు కూడా ముందుకు లంఘించి, తన కత్తితో ఒక శత్రువును అడ్డంగా నరికాడు.

ఆ తరవాత క్రూరాతిక్రూరమైన పోరు ప్రారంభమైంది. ఉగ్రాక్షుడు తనకు తగిలిన గాయాలను సరకు చేయక, భీకరంగా రంకెలు వేస్తూ, తన చేత గల రాతిగదతో భయంకర పక్షులను మోద సాగాడు. అవి అతడి దెబ్బలను తప్పుకుంటూ, పక్కకు ఎగిరి అంతలోనే వచ్చి అతడి మీద కలబడసాగినై. వాటి ముక్కుపోట్లకూ, కాలి గోళ్ళ దెబ్బలకూ, ఒక్క ఉగ్రాక్షుడే కాక, అతడి సేవకులు కూడా గురి అయారు.

సాచి, ఉగ్రాక్షుడూ, చిత్రసేనుడూ వున్న చోటుకు పరిగెత్తి రాసాగినై. వాటి వెనకగా పులి చర్మం ధరించినవాళ్ళు బరిసెలు ఊపుతూ ముందుకు దూకుతున్నారు.

చిత్రసేనుడు కత్తి దూశాడు. ఉగ్రాక్షుడు దిక్కులు పిక్కటిల్లేలా రంకెవేసి తన చేత గల రాతిగద ఝుళిపిస్తూ, కుప్పించి ముందుకు దూకాడు. అతడు రాతిగదతో తల మీద బలంగా కొట్టేసరికి, ఒక భయంకర పక్షి పక్కకు పడిపోయింది. కాని, రెండోది అతడి కుడి భుజాన్ని కాళ్ళతో గట్టిగా తన్నుతూ, ముక్కుతో బలంగా తల మీద పొడిచింది. అదే క్షణాన ఉగ్రాక్షుడి సేవకులైన రాక్ష

చిత్రసేనుడు తన కత్తి దెబ్బకు ఒక శత్రువు కింద పడగానే, తతిమ్మావాళ్ళ మీదికి ఉరికాడు. వాళ్ళు తమ బరిసెలతో అతడి కత్తి నుంచి రక్షణ చేసుకుంటూ, విచిత్రమైన ఈలలు వేస్తూ వెనక్కు తగ్గ సాగారు. వాళ్ళను చుట్టుముట్టాలన్న ప్రయత్నం, పక్షులు అడ్డు రావటంతో, చిత్రసేనుడికీ, ఉగ్రాక్షుడి అనుచరులకూ సాధ్యం కాలేదు. అవి తమ రెక్కలతో, ముక్కులతో, కాళ్ళతో వారిని చితక

బాదుతూ, తమ యజమానులతోపాటు వెనక్కు వెళ్ళసాగినై.

ఇది చూసిన ఉగ్రాక్షుడు భయంకరంగా ఘూర్ణిల్లుతూ, రాతి గదను రెండు చేతులతో రివ్వురివ్వుమని తిప్పుతూ, ముందుకురికాడు. ఆసరికి చావగా మిగిలిన శత్రువులు ముగ్గురూ, పక్షుల రెక్కల మీదికి ఎగబాకారు. వాళ్ళు కీచుమంటూ పెద్దగా ఈల వేయగానే పక్షులు గాలిలోకి లేచినై. ఉగ్రాక్షుడు రాతి గదను గాలిలో గిర్రున తిప్పి, వాటికేసి విసిరాడు. ఆ ఊపుకు అతడు వెల్లకిలా పడిపోయాడు. బాణంలా మీదికి వస్తున్న గదను ఒక భయంకర పక్షి ముక్కుతో గట్టిగా పొడిచింది. ఆ వెంటనే రాతి గద దభీమంటూ కింద పడిపోయింది.

గాయాలవల్ల రక్తం వరదలై పారుతూ కిందపడివున్న ఉగ్రాక్షుణ్ణి, చిత్రసేనుడు సమీపించి, "ఉగ్రాక్షా! ప్రాణాపాయకరమైన దెబ్బలేమీ తగలలేదుగదా?" అని అడిగాడు.

"ప్రాణాపాయమా!" అంటూ ఉగ్రాక్షుడు బాధతో మూలిగి, "ప్రాణాపాయం ఏమీ లేదు. బహుశా, పదిరోజులపాటు మంచం పట్టవలసివస్తుంది. నా సేవకులెంతమంది చచ్చారు?" అని అడిగాడు.

"ఇద్దరిని భయంకర పక్షులు ముక్కులతో చీల్చివేసినై. నలుగురు గాయాల బాధతో మూలుగుతున్నారు." అంటూ సమీపానికి వస్తున్న రాక్షసులకేసి తిరిగి, "శత్రువుల్లో ఒక్కడే గదా, చచ్చింది?" అని అడిగాడు చిత్రసేనుడు.

"అవును, రాజా!" అన్నారు వాళ్ళు.

"ఛీ, పిరికిపందల్లారా! ఇంతమంది రాక్షసవీరులం వుండగా, ఎక్కడినుంచో వచ్చిన మానవమాత్రులు మనల్ని చావ చితకకొట్టటమా? ఛీ!" అంటూ ఉగ్రాక్షుడు లేవబోయాడు. అంతలో, అతడి సేవకులు దగ్గిరకు వచ్చి, అతణ్ణి నడుమూ, భుజాలూ పట్టుకుని లేవనెత్తి, నిలబెట్టారు. —(ఇంకావుంది)






# కృపాకరుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎవరి మీదనైనా పంతం కొద్దీ, ఏదో సాధించాలన్న పట్టుదలతో, నువ్విన్ని శ్రమలకు ఓర్పు వహిస్తున్నావేమో, నాకు తెలియదు. కాని, ఏదో ఆవేశంలో మనిషి పట్టే పంతాలకూ, చేసే ప్రతిజ్ఞలకూ కాలగతిలో క్రమంగా అర్థం లేకుండా పోతుంది. అతడు వాటికి భిన్నంగా ప్రవర్తిస్తాడు. ఇందుకు ఉదాహరణగా, కృపాకరుడనేవాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

రామానందుడనే వర్తకుడికి, ఇద్దరు కొడుకులు. పెద్దవాడు ప్రీతివాసుడు

## బేతాళ కథలు



మందబుద్ధి. చిన్నవాడు కృపాకరుడు చాలా చురుకైనవాడే కాని, కురూపి. రామానందుడికి నలభయ్యేయేట భార్య పోయింది. ఆయనకు భార్య అంటే అమితమైన ప్రేమ. ఆ కారణం వల్ల, బెంగతో మంచం పట్టాడు. ఆనాటి నుంచి కృపాకరుడే వర్తకవ్యవహారాలన్నీ చూసు కుంటూ, ఆస్తిని బాగా వృద్ధిపొందిం చాడు.

అలా కొంతకాలం గడిచాక, గుణ శేఖరుడనే వర్తకుడు, రామానందుడి ఆస్తిపాస్తుల గురించి విని, తన ఇద్దరు కూతుళ్ళనూ ప్రీతివాసుడికీ, కృపాకరు డికీ ఇచ్చి పెళ్ళి చేయాలనుకున్నాడు.

పెళ్ళి చూపుల్లో గుణశేఖరుడి పెద్ద కూతురు రమ, ప్రీతివాసుడి అందం చూసి ఇష్టపడింది. రెండవ కూతురు శోభ మాత్రం, కృపాకరుడు కురూపి అని నిరాకరించింది.

దానితో కృపాకరుడికెంతో కోపం వచ్చి, తాను శోభ కంటే అందమైన అమ్మాయిని, భార్యగా తెచ్చుకుంటానని పంతం పట్టాడు.

ప్రీతివాసుడికీ, రమకూ వివాహం అయింది. ఆ తర్వాత కొన్నాళ్ళకు రామానందుడు మరణించాడు.

మామగారు పోయాక ఒక రోజున రమ, కృపాకరుడి వద్దకు వచ్చి, ''మరిదీ, నువ్వు చాలా తెలివైనవాడివి. నా భర్త మందబుద్ధి. నా చెల్లెలు శోభ తిరస్కరించి నందుకు, నీకు, నా మీద కోపం కూడా వుండవచ్చు. మాకే అన్యాయం జరిగినా సరిదిద్దడానికి, మామగారు కూడా బ్రతికి లేరు. నా బ్రతుకేమవుతుందో అని భయంగా వున్నది!'' అన్నది.

''వదినా, నేనేం చేస్తే, నీ భయం తొలగిపోతుందో చెప్పు. అలాగే చేసి, నా మంచితనాన్ని ఋజువు చేసుకుంటాను,'' అన్నాడు కృపాకరుడు.

''ఆస్తిలో సగం వాటా, నీ అన్నగారి పేరున రాసివ్వు,'' అన్నది రమ.



"సగమెందుకు? పూర్తిగా రాసిస్తాను." అని కృపాకరుడు, యావదాస్తికీ అన్న గారినే వారసుణ్ణి చేసి, తను వర్తక వ్యవహారాలు మాత్రం చూడసాగాడు.

ఆస్తి భర్త పేరున మారాక, రమ ప్రవర్తనలో మార్పు వచ్చింది. ఆమె మరిదిని చులకనగా చూడసాగింది. ఆమెను అనుసరించి, ఇంట్లో పనివాళ్ళు కూడా అతణ్ణి లెక్కచేయడం మానేశారు. ఆస్తి లేనివాడికి గౌరవం వుండదని గ్రహించిన కృపాకరుడు, తాను ఇల్లు వదిలిపోదలిచి, అన్నా వదినెలను సెలవు కోరాడు.

"నీవు వెళ్ళవద్దు. నీ కన్యాయం చేసి ఇంట్లోంచి వెళ్ళగొట్టామని మాకు చెడ్డ పేరు వస్తుంది," అన్నది రమ.

"వదినా, నేను సమర్థుణ్ణి. స్వశక్తితో మీకంటే సంపన్నుడినై, తిరిగివస్తాను. అన్నగారు సంపాయించుకోలేదన్న జాలితో, ఈ ఆస్తిని నేనే, మీకు వదిలి వెళ్ళానని పదిమందికీ చెప్పుకోండి," అని చెప్పి, కృపాకరుడు ఇల్లు వదిలాడు.

అయితే, కృపాకరుడికి ఎక్కడికి వెళ్ళాలో తెలియలేదు. తన ఊరుకు వీలైనంత దూరం పోవాలన్న ఉద్దేశంతో, అతడు అడవిదారి పట్టాడు. అడవిలో కొంతసేపు నడిచాక, కృపాకరుడికి అలసటతోపాటు, విపరీతమైన ఆకలి వేసింది.

అతడు ఒక చెట్టు కింద కొంతసేపు విశ్రమించి, దాపుల ఏదైనా ఫలవృక్షాలున్న వేమో అని చూసేంతలో, ఒక చెట్టు కింద ఇద్దరు మనుషులు పడుకుని వుండడం కంటబడింది.

కృపాకరుడు వాళ్ళకేసి నడిచాడు. అతడు తమను సమీపిస్తున్నంతలో, ఆ ఇద్దరూ చేతులు జోడించి, అతడికి నమస్కరించి, "బాబూ, సమయానికి దేవుడిలా వచ్చావు. దొంగలు మమ్మల్ని చావబాది, ఉన్నదంతా దోచుకుపోయారు. ఆకలి బాధకు తాళలేని స్థితిలో వున్నాం. ఏమైనా



తింటే తప్ప, మేమిక్కడి నుంచి కదలలేం," అన్నారు.

అ పక్కన వున్న ఒక చెట్టుకు, పండిన ఫలాలుండడం గమనించిన కృపాకరుడు చెట్టెక్కి పళ్లు కోశాడు. మొత్తం పన్నెండు ఫలాలు అతడికి దొరికినై.

వాటిని వాళ్ల ముందుంచి, కృపాకరుడు, "అయ్యలారా, ఆకలివల్ల శోషవచ్చిన స్థితిలో వున్న మీరు, వీటిని ముందుగా భుజించడం న్యాయం. మీరు తినగా మిగిలితే, నేను తింటాను," అన్నాడు.

వాళ్ళు ఆ ఫలాలన్నిటినీ ఆవురావురు మంటూ తినేసి, కృపాకరుడి కేమీ మిగల్చ నందుకు బాధపడసాగారు.

కృపాకరుడు, వాళ్ళతో, "నేను ఒంట్లో ఓపిక వున్నవాడిని. నేను తర్వాత ఏదో విధంగా ఆహారం సంపాయించుకోగలను. మీరు బయలుదేరండి," అన్నాడు.

అప్పుడు వాళ్ళల్లో ఒకతను, "నా పేరు రత్నస్వామి. నగరంలో పేరు పొందిన వ్యాపారిని. ఇతడు, నా సేవకుడు కుముదుడు. నావల్ల నీకేదైనా సాయం కావాలంటే చెప్పు. తప్పకుండా చేయ గలిగింది చేస్తాను," అన్నాడు.

కృపాకరుడు, రత్నస్వామికి తన కథ చెప్పగానే, అతడు ఎంతో ఉత్సాహంగా, "నాకు కొడుకులు లేరు. వ్యాపారంలో నమ్మకస్థుడైన సహాయకుడు లేక, చాలా ఇబ్బంది పడుతున్నాను. నీకు మంచి వేతనమిస్తాను. నాతో బయల్దేరి వచ్చెయ్యి," అన్నాడు.

కృపాకరుడు అందుకు సరేనని, రత్న స్వామితో కలిసి నగరానికి వెళ్ళాడు. కుముదుడు, కృపాకరుడికి తన ఇంట వసతి కల్పించి, తన ఋణం తీర్చు కుంటానన్నాడు. రత్నస్వామి అతడికి ఉద్యోగం ఇచ్చి, తన ఋణం తీర్చు కున్నాడు.

అతి స్వల్ప కాలంలోనే వ్యాపారంలో కృపాకరుడి తెలివితేటలవల్ల, రత్న స్వామికి మంచి లాభాలు వచ్చినై.



అందుకు సంతోషించి. రత్నస్వామి తన కిచ్చిన కానుకల్లో, కృపాకరుడు సగానికి సగం కుముదుడికి ఇస్తూండేవాడు.

కుముదుడికి మనోహరి అనే అపరంజి బొమ్మలాంటి కూతురున్నది. ఆమె, కృపాకరుడి తెలివికి, సమర్థతకుఅచ్చెరువు చెంది, క్రమంగా అతణ్ణి ప్రేమించ సాగింది.

రత్నస్వామికి కూడా రజితవతి అనే కూతురున్నది. ఆమె కురూపి. కృపాకరుడంటే, ఆమెకూ ప్రేమ కలిగింది.

మనోహరి, రజితవతి తమ మనసుల్లోని భావాలు, కృపాకరుడి కెలా చెప్పాలో తెలియక, ఒకరినొకరు సాయమడగాలనుకున్నారు. ఒకే మనిషికోసం, తామిద్దరూ పోటీపడుతున్నట్టు అర్థం కాగానే, కృపాకరుడి ఇష్టం తెలుసుకుని, ఆ ప్రకారం చేయాలనుకున్నారు.

''నేను చాలా సౌందర్యవతిని; కృపాకరుడు కురూపి. నా వంటి అందగత్తెను, అతడు కాదనలేడు. పైగా, అందగత్తెను పెళ్ళాడతానని లోగడ శపథం కూడా చేశాడు. అందువల్ల, కృపాకరుడు తప్పకుండా నన్నే పెళ్ళాడతాడు,'' అనుకున్నది మనోహరి.

''నేను భాగ్యవతిని; కృపాకరుడు పేదవాడు. నా వంటి సంపన్నురాలినతడు కాదనలేడు. పైగా, అన్నగారిని మించిన సంపదను కూడబెడతానని శపథం పట్టాడు. అందువల్ల, కృపాకరుడు, తప్పక నన్నే పెళ్ళాడతాడు,'' అనుకున్నది రజితవతి.

వాళ్ళిద్దరూ తమ కోర్కెను స్వయంగా కృపాకరుడికి చెప్పుకోలేక, తండ్రులతో చెప్పుకున్నారు. అది విని రత్నస్వామి, కుముదుడు ఎంతో సంతోషించి, సంగతి కృపాకరుడికి చెప్పారు. అతడు మారాలోచించకుండా, రజితవతిని పెళ్ళాడతానన్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, కృపాకరుడు సౌందర్యవతి అయిన మనో

హరిని కాదని, సంపన్నురాలైన కురూపి రజితవతిని, పెళ్ళాడడంలో వున్న అంతర్యం—కేవలం ధనానికి విలువ నివ్వడమే కదా? అతడు, ఈ పెళ్ళి ద్వారా అన్నను మించిన ధనవంతుడై వుండవచ్చు. కాని, తనను నిరాకరించిన శోభ కన్న అంతగత్తెను మాత్రం వివాహ మాడలేకపోయాడు. ఇలా జరగడానికి కారణం ఏమిటి? ఇందుకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కృపాకరుడు, రజితవతిని వివాహమాడడానికి కారణం, ధనానికి విలువనివ్వడం కానేకాదు. అతడు ఎంతో నీతీ నిజాయితీ గల వ్యక్తి అనేది, మొదటి నుంచీ తెలుస్తూనే వున్నది. ప్రయోజకుడు కాని అన్నకు, ఆస్తినంతా వదిలిపెట్టాడు. అడవిలో అసహాయస్థితిలో వున్న రత్నస్వామికీ, కుముదుడికీ ముందు ఆహారం ఇచ్చి, ఆ తర్వాత తన ఆకలి తీర్చుకున్నాడు. రజితవతిని వివాహమాడడంలో కూడా, అతడు గొప్ప నైతికవిలువలను ప్రదర్శించాడు. మనోహరి అందగత్తె. ఆమె అందానికి మురిసి, ఏ గొప్పవాడో ఆమెను తప్పక వివాహం ఆడతాడు. రజితవతి కురూపి. ఆమెనెవరైనా డబ్బు కోసం తప్ప నిజంగా ప్రేమించరు. కృపాకరుడి లాంటి కురూపి కూడా, ఆమెను నిరాకరిస్తే, ఆమెకు మంచి భర్త దొరకడం దుర్లభం. ఇకపోతే, శోభకన్న అందగత్తెను వివాహమాడతానన్న అతడి ప్రతిజ్ఞ! ఆ ప్రతిజ్ఞ నెరవేరాలంటే, తాను ధర్మ మార్గాన్ని విడిచి పుచ్చవలసి వస్తుందన్న సంగతి, కృపాకరుడి వంటి వాడికి తెలియంది కాదు. అందువల్లనే, అతడు నీతీ ధర్మాలకు తిలోదకాలివ్వక, తను తాత్కాలికావేశంతో చేసిన ప్రతిజ్ఞను విస్మరించాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)







# ఉపాయం

తాష్కెంటు నగరంలో మీర్‌కమల్ అనే వ్యాపారి ఉండేవాడు. వాడూ, వాడి భార్య జమీరా తిండికోసం వాళ్ళనూ, వాళ్ళనూ యాచించేవారు. వారికి పిల్లలు లేరు. డబ్బు ఖర్చు చెయ్యకుండా పొట్ట నించుకోవటం తప్ప వారికి మరో ఆశయం ఏదీ లేదు. మీర్‌కమల్ వారానికి ఆరు రోజులు అమ్మకం మీద తిరిగి, బుధవారాలు మాత్రమే ఇంటి దగ్గిర ఉండేవాడు.

ఒక బుధవారంనాడు జమీరా కంటతడి పెట్టుకుని తన భర్తతో, "నువు ఏమన్న మొగుడివి? ఈ దిక్కుమాలిన కొంపలో ఒంటరిగా ఉంటే నాకు మతి పోతున్నది. నాకు తోడుగా ఉండటానికి ఒక దూడనో, గొర్రెనో కొంటే మిన్ను విరిగి మీద పడుతుందా?" అన్నది.

మీర్‌కమల్ రెండేళ్ళ వయసు గల బక్కచిక్కిన గొర్రెను కొని తెచ్చాడు.

జమీరాకు తోచకపోవటమనే సమస్య పోయింది. ఆ గొర్రె అస్తమానమూ అరుస్తూ, ఆ చుట్టుపక్కల మెయ్యటానికి ఉన్నదంతా మేసేసింది.

మళ్ళీ బుధవారం నాడు మొగుడు ఇంటికి రాగానే జమీరా కంట తడి పెట్టుకుని, "నా ప్రాణం మీదికి ఈ గొర్రెను ఎందుకు తెచ్చావు? నేను నాలుగు కాలాలపాటు బతకాలని నీకు లేదల్లే ఉంది! దీన్ని పంపేస్తావా, లేక నన్ను పుట్టింటికి వెళ్ళిపొమ్మన్నావా?" అన్నది.

"నువు తొందరపడి వెళ్ళిపోకు, ఈ గొర్రె సంగతి నేను చూస్తాను," అన్నాడు మీర్‌కమల్ తన భార్యతో.

ఆ రోజే అతను తన తల్లి సమాధికి దణ్ణం పెట్టుకు రావటానికి గోరీ లుండే చోటికి వెళ్ళాడు. అక్కడ పచ్చిక ఏపుగా పెరిగి నవనవలాడుతున్నది. తన గొర్రెకు

ఉజ్బెక్ జానపద కథ

ఇంతకన్న మంచి విందు ఉండదను కున్నాడు మీర్‌కమల్.

అతను గబగబా ఇంటికి వెళ్ళి, తన గొర్రెతో సహా గోరీల సంరక్షకుడి వద్దకు వచ్చి, అతనితో, "అన్నా, పెద్దవాడినై పోయాను. నాకు పిల్లా జెల్లా లేరు. అల్లా పిలిచినప్పుడు నన్ను నువే పాతిపెట్టాలి. అందుకుగాను నీకు డబ్బు ఇచ్చుకోవ టానికి నా వారసులెవరూ లేరు. కనక ఇప్పుడే ఈ గొర్రెను నీకు ఇచ్చుకుంటు న్నాను," అన్నాడు. అందుకు గోరీల సంరక్షకుడు అభ్యంతరం చెప్పలేదు.

రెండు నెలలు గడిచాయి. ఒకనాడు మీర్‌కమల్ గోరీల వద్దకు వచ్చి, తన గొర్రెను చూసి గుర్తించలేకపోయాడు. అది తెగబలిసి, కొవ్వు పట్టి ఉన్నది.

"దీని బరువు రెండు మణుగులకు పైనే ఉంటుంది. ఇంత లావు గొర్రెను దానం చెయ్యటంకన్న బుద్ధి తక్కువ ఉండదు. దీన్ని పట్టుకుపోవలిసిందే!" అనుకున్నాడు మీర్‌కమల్.

వాడు తిన్నగా గోరీల సంరక్షకుడి ఇంటికి వెళ్ళి, తలుపు తట్టి, సలాంకొట్టి, "ఛీ, ఛీ, నా బతుకు చట్టుబండలయింది. ఒక గ్రామంలో కుర్రాడికి తడపరవస్తే, అరచెంచాడు రసకర్పూరం ఇచ్చాను. వాడు కాస్తా చచ్చాడు. నన్ను తాక్షెంటు నగరం విడిచిపొమ్మన్నారు. నువు తట్టా, బుట్టా సర్దుకుని ప్రయాణంకా!" అన్నాడు.

"నే నెక్కడికి?" అని ఆశ్చర్యంగా అడిగాడు గోరీల సంరక్షకుడు.

"ఎక్కడికేమిటి? నాతోపాటు ప్రవా సానికి. నేను చస్తే పూడ్చిపెట్టటానికి ఒప్పు కున్నావు గద! అందుకు నీకు గొర్రెను కూడా ఇచ్చాను గద! నేను ఎక్కడ చస్తే అక్కడ నువు ఉండి, నన్ను పూడ్చవద్దా మరి?" అన్నాడు మీర్‌కమల్.

"ఛా! నువు నీ యిష్టం వచ్చిన చోట చావు. నువూ నీ గొర్రే కలిసి ఏట్లో దూకండి!" అన్నాడు గోరీల సంరక్షకుడు.

మీర్‌కమల్ తన గొర్రెను తీసుకుని ఆడుతూ పాడుతూ ఇంటికి వెళ్లిపోయాడు.






మన దేవాలయాలు:

# ఖజురహో

వేనవేల సంవత్సరాలకు పూర్వం, వింధ్య పర్వతానికి పశ్చిమ దిశగా ప్రకృతి సౌందర్యానికి నిలయమైన ఒక లోయ ఉండేది. ఒకనాటి పున్నమిరేయి ఒక బ్రాహ్మణకన్య ఆ లోయలోని తటాకంలో స్నానం చేయడానికి వెళ్ళింది.

ఆ లోయ ప్రకృతి సౌందర్యానికీ, ప్రశాంత వాతావరణానికీ ముగ్ధుడయిన చంద్రుడు, మానవరూపం ధరించి కొండశిఖరం మీదికి దిగి, పరిసరాల అందచందాలను ఆస్వాదిస్తూ తిరగ సాగాడు.





చంద్రుడు, అందాలరాశి అయిన బ్రాహ్మణకన్య స్నానం చేస్తున్న సరో వరం కేసి వచ్చి, ఆమె అందచందా లను చూసి ఆశ్చర్యానందాలు చెందాడు. మెల్లగా ఆమెను సమీపిం చాడు.



ఆ రోజు నుంచి చంద్రుడు ప్రతి రేయీ, అక్కడికి వచ్చి, ఆమెతో కబుర్లు చెప్పుకోసాగాడు. కొంత కాలానికి ఇరువురూ గాంధర్వవివాహం చేసుకుని హాయిగా కాలం గడిపారు.

దేవుడయిన చంద్రుడు చిరకాలం మానవరూపంలో ఉండడం సాధ్యం కాదు కనుక, ఆయన అక్కడి నుంచి దేవలోకం వెళ్ళవలసిన సమయం ఆసన్నమయింది. "నీ కడుపున పుట్టే కుమారుడు గొప్ప వంశానికి మూల పురుషుడు అవుతాడు," అని భార్యకు వరం ఇచ్చి, చంద్రుడు వెళ్లిపోయాడు.





చంద్రుడి భార్య మగశిశువును ప్రసవించింది. వాడు అందచందాలతో, అద్భుతమైన తెలివితేటలతో, అపూర్వమైన ధైర్యసాహసాలు కనబరుస్తూ పెరిగి పెద్దవాడై ఆ ప్రాంతానికి నాయకుడయ్యాడు.

మరి కొంతకాలానికి ఆ యువకుడు ఆ ప్రాంతానికి రాజై, ధర్మం తప్పకుండా రాజ్యపాలన చేయసాగాడు. చంద్రుడి నుంచి ప్రారంభం కావడం వల్ల ఆయన వంశం చండేల వంశంగా ప్రఖ్యాతి గాంచింది.





తమ తల్లిదండ్రులు మొట్టమొదట ఖర్జూరపుచెట్టు నీడన కలుసుకున్న దానికి జ్ఞాపకచిహ్నంగా, రాజు తాను నిర్మించిన నగర సింహద్వారంలో రెండు బంగారు ఖర్జూరపు చెట్లను నాటించాడు. ఆ కారణంగానే ఆ నగరానికి ఖజురహో అనే పేరు వచ్చింది.

అచిరకాలంలోనే ఖజురహో సంపన్న నగరంగా పేరుగాంచింది. ప్రపంచం నలుదిశల నుంచీ వ్యాపారులు, అక్కడికి రాసాగారు. వివిధ వంశాలకు చెందిన రాజులు అక్కడ అసంఖ్యాకమైన ఆలయాలు నిర్మించారు. వాటిలో ఇరవై అయిదు దేవాలయాలు ఇప్పటికీ చెక్కు చెదరకుండా ఉన్నాయి.





పదవ శతాబ్దంలోనూ, పదకొండవ శతాబ్దంలోనూ ఈ ప్రాంతాన్ని పరిపాలించిన చండేల వంశం రాజులు ఇక్కడ ఎన్నో ఆలయాలు నిర్మించారు. విలక్షణమైన సింహాకృతి గల విగ్రహం, చండేలరాజవంశానికి చిహ్నంగా వెలుగొందుతున్నది.

ఖజురహో దేవాలయాలలో కెల్లా, కాందరీయ మహాదేవ ఆలయం చాలా పెద్దది. ముప్పై మీటర్ల ఎత్తుగల ఈ దేవాలయం నిండా, జీవితాన్ని ప్రతిబింబించే ఎన్నో అద్భుత శిల్పాలు నిత్యనూతనంగా ప్రకాశిస్తున్నాయి.





ప్రస్తుతం యేటా ఖజురహోలో భారీ ఎత్తున నాట్యోత్సవాలు జరుగుతున్నాయి. పౌరాణిక, చారిత్రక ప్రాముఖ్యత గల ఈ క్షేత్రం ఈనాడు కూడా సాంస్కృతిక కార్యకలాపాలకు కేంద్రంగా వెలుగొందుతున్నది.



# ఆలయ ధర్మకర్త

గణపవరం అనే గ్రామంలో, గుణనిధి అనే పేద నిరుద్యోగి వుండేవాడు. అతడు విద్యాభ్యాసం పూర్తయాక, ఎన్నో చోట్ల ఉద్యోగ ప్రయత్నాలు చేశాడు. కాని, ఎక్కడా ఉద్యోగం దొరకలేదు.

గ్రామానికి పెడగా పాడుపడిన దేవాలయం ఒకటున్నది. ఏమీ తోచనప్పుడు గుణనిధి అక్కడికిపోయి, ఆలయం ముందున్న పెద్ద రావిచెట్టు కింద కూర్చునేవాడు. అలాంటి సమయాల్లో ఎండ తీవ్రంగా వున్నా, ఎప్పుడయినా వానలాంటిది వచ్చినా, అతడు దేవాలయంలోకి పోతూండేవాడు.

దేవాలయంలో సాలెగూళ్ళూ, పేరుకుపోయిన దుమ్ముతోపాటు, ఎక్కడ చూసినా రాళ్ళూ రప్పలూ చిందరవందరగా పడివుండేవి. గుణనిధి తానుండడానికి సౌకర్యంగా వుంటుందన్న ఉద్దేశంతో, వాటన్నిటినీ అక్కడి నుంచి తొలగించి ఆలయాన్ని శుభ్రపరిచాడు.

ఊరివాళ్ళల్లో కొందరు అతడిచేత ఏదైనా ఉత్తరాలు రాయించుకునేందుకూ, చదివించుకునేందుకూ తరుచూ అతడున్న చోటుకు వస్తూండేవాళ్ళు. లోపల పరిశుభ్రంగా వున్న ఆలయాన్ని చూసి వాళ్ళు సంతోషించి, భక్తితో దేవికి మొక్కి తమ దగ్గిర వున్న చిల్లరనాణాలు విగ్రహం ముందు వుంచసాగారు. గుణనిధి వాటిని క్రమంగా తన సొంతానికి వాడుకోసాగాడు.

ఇలా వుండగా, ఒకసారి పొరుగూరు షావుకారు వ్యాపారం పని మీద పట్టణానికి పోతూ, ఆలయాన్ని చూసి అక్కడికి వచ్చి, విగ్రహం ముందు నిలబడి, తనకు గనక, మంచి లాభాలు వస్తే, గోడలు బావుచేయించి వెల్లవేయిస్తానని మొక్కుకున్నాడు.

పెంటకోట సోమినాయుడు



షావుకారుకు పట్టణంలో ఏనాడూ రానంతగా లాభం వచ్చింది. అతడు వెంటనే దేవాలయానికి అవసరం అయిన మరమ్మతులు చేయించి, కానుకలు సమర్పించి, ఆ ఆలయంలోని దేవి గొప్ప మహత్తులు గలదని నలుగురితో చెప్ప సాగాడు. క్రమంగా దేవాలయానికి వచ్చే భక్తుల సంఖ్యతోపాటు, వాళ్ళు సమర్పించే కానుకల విలువ కూడా పెరిగింది. గుణనిధి ఆ ధనం అంతా సొంతం చేసుకుని తిండికీ, బట్టకూ లోటు లేకుండా హాయిగా జీవించసాగాడు.

ఆ పరిస్థితుల్లో ఊరిలోని కొందరు గుణనిధిని గురించి ఆరాలు తీయసాగారు. వాళ్ళకు తెలిసిందేమంటే—అతడు ఏనాడూ ఆలయంలోని దేవికి మొక్కుతూండగా చూసినవాళ్ళు లేరు. అంతే కాదు, పర్వదినాల్లో కూడా అతడు ఉపవాసాలుంటున్న సూచనలు లేవు!

ఊరి పెద్దలు గ్రామాధికారికి, ఈ సంగతి, చెప్పారు. అయన గుణనిధిని పిలిపించాడు. అతడిపై ఆరోపణలు చేసినవాళ్ళు గ్రామాధికారితో, "గుణనిధి ఆలయానికి ధర్మకర్తగా వ్యవహరిస్తున్నాడు. అయినా, ఇతడిలో దైవభక్తి శూన్యం. ఈ దైవద్రోహానికి ఇతణ్ణి తగిన విధంగా శిక్షించాలి," అన్నారు.

ఇది విన్న గ్రామాధికారికి ఏమి చేయాలో తోచలేదు. ఆలయ ధర్మకర్త నాస్తికుడా! ఇలాంటి నేరానికి శిక్ష విధించవలసిన అవసరం అయనకు ఏనాడూ కలగలేదు. ఈ సమస్యను ఎలా పరిష్కరించడమా అని గ్రామాధికారి ఆలోచిస్తున్న తరుణంలో, ఆ దేశాన్నేలే రవివర్మ మహారాజు దేశాటన చేస్తూ, ఆ ఊరికి వచ్చాడు.

గ్రామాధికారి తన కెదురైన సమస్య గురించి రాజుకు విన్నవించుకున్నాడు. రాజు రవివర్మ, గుణనిధిని, "నీవు ఒక ఆలయానికి ధర్మకర్తవు. అలాంటి నీవు నాస్తికుడుగా మారి, దేవుడికి తీరని

ద్రోహం చేశావని ఆరోపణ వచ్చింది. దీనికి నీ సమాధానం ఏమిటి?'' అని ప్రశ్నించాడు.

''క్షమించండి, మహారాజా! నేను ఆలయ ధర్మకర్తనని ఎవరితోనూ చెప్పుకో లేదు. నిరుద్యోగినైన నేను, అప్పట్లో కాలం గడపడానికి, ఒక పాడుబడిన ఆలయాన్ని శుభ్రం చేసుకున్నాను. ప్రజలు వచ్చి అక్కడి విగ్రహానికి మొక్కి కానుకలు ఇవ్వసాగారు. నిరుపేదనైన నేను, ఆ డబ్బు వాడుకుంటున్నమాట నిజం. విగ్రహానికి మొక్కకపోవడం, పర్వదినాల్లో ఉపవాసాలుండకపోవడం— నాస్తికత్వమైతే, నేను నాస్తికుణ్ణే!'' అన్నాడు గుణనిధి.

''ఒక దేవాలయానికి ధర్మకర్తగా వ్యవహరిస్తున్న నీవు, నాస్తికుణ్ణని అంగీకరిస్తున్నావు. ఇందుకు నిన్నే విధంగా శిక్షించాలి?'' అన్నాడు రాజు.

''ఇదే ఊరిలో వున్న రామజోగయ్యకు ఎలాంటి శిక్ష విధిస్తారో, అలాంటి శిక్షే నాకూ విధించండి,'' అన్నాడు గుణనిధి వినయంగా.

''ఎవరా రామజోగయ్య? అతడు చేసిన నేరం ఏమిటి?'' అని అడిగాడు రాజు రవివర్మ.

''అతడు పెద్ద పొగాకు వ్యాపారి. పని వాళ్ళచేత చుట్టలు చుట్టించి, రోజూ కొన్ని వందలు అమ్ముతాడు,'' అని జవాబిచ్చాడు గుణనిధి.



"చుట్టలు అమ్మడం నేరం కాదే!" అంటూ రాజు ఆశ్చర్యపోయాడు.

"మహారాజా, సంగతేమంటే—ఆ రామజోగయ్య చుట్టలు అమ్మడమే కాని, ఒక్క చుట్ట కూడా కాల్చడు. పైగా, ఎవరైనా అడిగితే, చుట్టలు కాల్చడం ఆరోగ్యానికి హానికరం అని కూడా చెబుతాడు," అన్నాడు గుణనిధి.

ఆ జవాబు విని, రాజు కనుబొమలు ముడిచి, ఒక క్షణకాలం ఆలోచించి, చిరునవ్వు నవ్వుతూ, "నీ తర్కం అర్థమైంది నువ్వనే ఆ రామజోగయ్య పొగాకు వ్యాపారి. అయినా, చుట్ట కాల్చడం హానికరం అని చెబుతున్నాడంటే—అతడి నిజాయితీని మెచ్చుకోవాలి. నువ్వూ నిజాయితీపరుడివే! దొంగ భక్తి నటించకుండా, నీ భావాలను ధైర్యంగా వెల్లడించావు. అయితే, దైవ చింతన అన్నది మనిషికి ఎటువంటి ఆత్మ విశ్వాసాన్నీ, కష్టాలను సహించగల శక్తినీ యిస్తుందో, నీకు తెలియదు. నీవు నమ్మని దేవుడే, తన భక్తులు సమర్పించిన కానుకల ద్వారా, నీకు ఇంతకాలంగా తిండి పెట్టిన సంగతి సత్యదూరం కాదుగదా?" అన్నాడు.

"అవును, మహారాజా! ఆ మాట నిజం," అన్నాడు గుణనిధి.

"ఈ నాటి నుంచీ దేవాలయానికి ధర్మకర్తగా వుండడానికి, నీవు అర్హుడివి కాదు. అదే, నీకు విధించే శిక్ష!" అన్నాడు రాజు.

"నేను పేదవాణ్ణి, మరొకసారి నిరుద్యోగినైతే, నా తిండి మాటేమిటి! మళ్ళీ, ఏ శిథిలావస్థలో వున్న దేవాలయంలోనో తల దాచుకోవలసి వస్తుంది," అన్నాడు గుణనిధి.

రాజు ఆ మాటలకు నవ్వి, "అప్పుడు తిరిగి కథ మొదటికి వస్తుంది. నీకు నిరుద్యోగభయం లేదు. రాజధానికి రా. ఆస్థానంలో ఉద్యోగం యిస్తాను," అన్నాడు.

గుణనిధి ఎక్కడలేని ఆనందంతో, రాజుకు తల వంచి నమస్కరించాడు.





# ఉత్తరరామాయణం

శ్రీరాముడు రాక్షస సంహారం చేసి, అయోధ్యకు తిరిగి వచ్చి, రాజ్యాభిషిక్తుడై, రాజ్యపాలన చేస్తూ ఉండగా, ఒకనాడాయన ఇంటికి నాలుగు దిక్కులనుంచీ అనేకమంది మునులు అగస్త్యుడు మొదలుగాగలవారు వచ్చి, ద్వారపాలకుడి ద్వారా తాము రాముడి దర్శనానికి వచ్చినట్టు కబురు చేశారు. వెంటనే రాముడు వారిని సగౌరవంగా లోపలికి రప్పించి, అర్ఘ్యపాద్యాలతో సత్కరించి, ఉచితాసనాల పైన ఆసీనులను చేసి, కుశల మడిగాడు.

మునులు రాముణ్ణి మళ్ళీ రాజుగా చూడగలిగినందుకు తమ సంతోషాన్ని వెలిబుచ్చారు. రాముడు రావణుణ్ణి చంపటం ఒక లెక్కలోది కాదనీ, రాముడి చేతిలో చచ్చిన రాక్షస వీరు లందరూ గొప్పవాళ్ళే అయినప్పటికీ, ఇంద్రజిత్తు వంటి అజేయుణ్ణి లక్ష్మణుడి చేత చంపించటం అత్యాశ్చర్యకరమైన విషయమనీ వారన్నారు.

వారి మాటలు విని రాముడికి చాలా ఆశ్చర్యం కలిగింది. రావణ, కుంభకర్ణ, మహోదర, ప్రహస్త, దేవాంతక, నరాంతకుల వంటి రాక్షసవీరుల కన్న ఇంద్రజిత్తు పరాక్రమవంతుడని విని, అతను ఇంద్రజిత్తు ప్రభావ పరాక్రమాలను గురించి వినగోరాడు. అప్పు డగస్త్యుడు రాముడితో రావణవంశం గురించి ఈ విధంగా చెప్ప నారంభించాడు:

## 1. పులస్త్య వంశవృత్తాంతం



కృత యుగంలో బ్రహ్మ మానస పుత్రుడూ, రెండో బ్రహ్మ అనదగినవాడూ అయిన పులస్త్యుడు ఒకప్పుడు తపస్సు చేసుకుందామని, మేరు పర్వత ప్రాంతంలో ఉన్న తృణబిందుడి ఆశ్రమానికి వెళ్లాడు. అక్కడ ఆయన తపస్సు చేసుకుంటూ ఉండేటప్పుడు, దేవ నాగ రాజర్షి కన్యలు రోజూ వచ్చి, ఆటలాడి గోలచేస్తూ, ఆయన తపస్సుకు విఘ్నం కలిగించసాగారు. పులస్త్యుడు తన ఎదటికి వచ్చిన స్త్రీ గర్భవతి అవుతుందని శాపం పెట్టాడు. ఈ శాపం విని కన్యలంతా భయపడి ఆ క్షణం నుంచి ఆశ్రమానికి వెళ్ళటం మానుకున్నారు.

ఈ సంగతి తృణబిందుడి కుమార్తె ఎరగదు. ఆమె మామూలుగా పులస్త్యుడి ఆశ్రమానికి వచ్చి, తన స్నేహితురాళ్ళ కోసం వెతకసాగింది. ఆశ్రమమంతా వెతికినా ఒక్కరు కూడా ఆమెకు కనిపించలేదు. ఆమె తిన్నగా పులస్త్యుడు వేదాధ్యయనం చేస్తున్న చోటికి వెళ్ళింది. ఆయన దర్శనం కలగగానే ఆమెలో గర్భ చిహ్నాలు కలిగాయి, శరీరమంతా పాలి పోయింది.

ఆమె తనలో కలిగిన మార్పు చూసు కుని ఆశ్చర్యపోతూ, తన తండ్రి ఆశ్ర మానికి తిరిగి వెళ్ళి, "నాన్నా, నా ఒళ్ళంతా ఎలా మారిందో చూడు. నా స్నేహితురాళ్ళకోసం పులస్త్యాశ్రమానికి వెళ్ళేసరికి ఇలా జరిగింది. కారణం తెలీదు. నాకేమో భయంగా ఉంది," అన్నది.

తృణబిందుడు పులస్త్యుడి శాప ఫలితంగా తన కుమార్తె గర్భవతి అయిం దని గ్రహించి, ఆమెను తీసుకుని పులస్త్యుడి వద్దకు వెళ్ళి, "మహానుభావా, ఇది నా కూతురు, గుణవంతురాలు. మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చిన దీన్ని భార్యగా స్వీకరించి, దీనిద్వారా సేవలు పొందండి," అన్నాడు. పులస్త్యుడు సరేనన్నాడు.

తన భార్య గుణాలూ, నడవడీ పులస్త్యు డికి సంతోషం కలిగించాయి. ఆయన ఆమెతో, "నీవు చాలా యోగ్యురాలవు. నీ గర్భాన నా అంతటి కొడుకు కలుగు తాడు. నేను చేసే వేదపఠనం వింటూం డగా నువు గర్భవతి వయావు గనక నీ కొడుకు విశ్రవసుడనే పేరు తెచ్చుకుం టాడు. నా కొడుకు గనుక పౌలస్త్యుడని అందరిచేతా చెప్పబడతాడు," అన్నాడు గంభీరంగా.

అలాగే కొంత కాలానికి ఆమె గర్భాన విశ్రవసుడు పుట్టి, సత్య శీల శౌచ శాంతా లకు ప్రసిద్ధి పొందాడు. అతన్ని గురించి గొప్పగా విని, భరద్వాజ మహాముని తన కూతురైన దేవపర్ణిని తీసుకువచ్చి అతనికి పెళ్ళి చేశాడు. విశ్రవసుడామెతో గృహస్థా శ్రమం గడుపుతూ ఒక కొడుకును కన్నాడు. ఆ కొడుకు పుట్టగానే బ్రహ్మ స్వయంగా వచ్చి, ఆ కుర్రవాడు ధనాధి పతి అవుతాడని చెప్పి, అతనికి వైశ్రవణు డని పేరుపెట్టి వెళ్ళిపోయాడు.

వైశ్రవణుడికి చిన్నతనం నుంచీ తపస్సే అతి ముఖ్యమనిపించింది. అతను మహారణ్యానికి వెళ్ళి, జలభక్షణా, వాయుభక్షణా, నిరాహారదీక్షా అవలం బించి, బ్రహ్మను గూర్చి మూడువేల సంవత్సరాలు కఠోరతపస్సు చేశాడు. ఆ



తపస్సుకు మెచ్చి, బ్రహ్మ ఇంద్రాది దేవతలతో సహా ప్రత్యక్షమై, "నాయనా, నీ తపస్సుకు సంతోషించాను. వరం కోరుకో," అన్నాడు.

"తాతా, నాకు లోకపాలకత్వమూ, ధనాధిపత్యమూ కావాలి," అన్నాడు వైశ్రవణుడు.

"నేను కూడా మరొక లోకపాలకుణ్ణి సృష్టించే ఆలోచనలోనే ఉన్నాను. ఇంద్ర యమవరుణులతో బాటు నీవు కూడా నాలుగో లోకపాలకుడివిగా ఉండి నిధుల కధిపతివికా! ఇదిగో, సూర్యప్రకాశంతో వెలిగే పుష్పకమనే విమానం. దీన్ని ఎక్కి తిరుగుతూ, దేవతలతో సమానుడవై

ఉండు,'' అని చెప్పి, బ్రహ్మ వెళ్ళి పోయాడు.

ఇలా బ్రహ్మవల్ల కోరిన వరాలు పొంది వైశ్రవణుడు, తన తండ్రి ఆశ్రమానికి వచ్చి, ''నాన్నా, బ్రహ్మ నాకు వరాలయితే ఇచ్చాడు గాని, నేను నివాసం కల్పించు కోవటానికి ఆయన చోటు చూపలేదు. ఇతరులకు ఇబ్బంది కలగకుండా నేను హాయిగా ఉండదగిన చోటుంటే చూడు,'' అన్నాడు.

కొడుకు చెప్పిన మాట విని విశ్రవుడు చాలా సంతోషించి, ''నాయనా, దక్షిణ సముద్రతీరాన త్రికూటపర్వత శిఖరాన విశ్వకర్మ దేవేంద్రుడి అమరావతిని పోలిన నగరాన్ని, లంక అనే దాన్ని నిర్మించాడు. చాలా అందమైన పట్టణం, అది సువర్ణప్రాకారాలూ, పరిఖలూ కలది, వైడూర్య తోరణాలతో కూడుకున్నది. అది మొదట రాక్షసుల కోసమే నిర్మించ బడింది. కాని విష్ణుమూర్తికి భయపడి రాక్షసులా పట్టణాన్ని విడిచి పాతాళానికి వెళ్ళిపోయారు. ఇప్పుడది శూన్యంగా ఉన్నది. అక్కడ నీ నివాసం ఏర్పాటు చేసుకున్నావంటే ఎవరికీ ఇబ్బంది ఉండదు,'' అని చెప్పాడు.

వైశ్రవణుడు తండ్రి సలహా ప్రకారం, అనేక వేలమంది నైరృతులతో సహా లంకానగరానికి వెళ్ళి అక్కడ నివాసం ఏర్పాటు చేసుకుని, సుఖంగా రాజ్యం ఏలుతూ, పుష్పక విమానంలో అప్పు



డప్పుడూ వచ్చి తన తల్లిదండ్రులను చూసి పోతూండేవాడు.

ఇదంతా విని రాముడు ఆశ్చర్యంతో అగస్త్యుడి కేసి చూసి, ''మహాత్మా, రాక్షసులు పులస్త్య వంశంలోనే పుట్టారని విన్నాను. కాని అంతకు ముందు కూడా రాక్షసు లుండినట్టు మీరు చెబుతున్నారు. ఈ రాక్షసులకు మూలపురుషు డెవరు?'' అని అడిగాడు. దానికి అగస్త్యు డిలా చెప్పాడు:

కమలంలో పుట్టిన బ్రహ్మ నీటిని సృష్టించి, దాన్ని కాపాడటానికి కొందరు ప్రాణులను సృష్టించాడు. ఆ ప్రాణులు ఆకలి దప్పులతోనూ, భయంతోనూ, ''మే మేం చెయ్యాలి?" అని బ్రహ్మ నడిగారు. బ్రహ్మ నవ్వులకన్నట్టుగా, ''ఈ జలాన్ని కాపాడటానికి ప్రయత్నించండి.'' అన్నాడు. కొందరు ప్రాణులు రక్షిస్తా మన్నారు; మరి కొందరు జక్షిస్తా మన్నారు. (జక్షించటమంటే భక్షించటం.) రక్షిస్తా మన్న ప్రాణులు రాక్షసులయారు. జక్షిస్తా మన్నవారు యక్షులయారు.

రాక్షసులలో హేతీ, ప్రహేతీ అనే ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. వారిలో ప్రహేతి తపస్సు చేసుకోవటానికి వెళ్ళిపోయాడు. హేతి అనేవాడు మాత్రం పెళ్ళి చేసుకోగోరి, భార్య కోసం వెతుకుతూ, చివరకు యముడి చెల్లెలు భయ అనేదాన్ని, భయంకరమైన దాన్ని పెళ్ళాడాడు.





వారికి విద్యుత్కేశు డనే కొడుకు, సూర్యసమకాంతి గలవాడు పుట్టి పెరగ సాగాడు.

వాడికి యౌవనం రాగానే వాడి తండ్రి అయిన హేతి వాడి కొక భార్యను నిశ్చయించాడు. ఆ పిల్ల సంధ్య అనేదాని కూతురు. దాని పేరు సాలకటంకట. సాలకటంకట విద్యుత్కేశుణ్ణి పెళ్ళాడి, భర్తతో సుఖంగా విహారాలు చేస్తూ, గర్భవతి అయి, మందర పర్వత ప్రాంతంలో ఒక కొడుకును కన్నది. అయితే ఆమె కా కొడుకు పైన కన్న, భర్తతో విహరించటం మీదనే ఆసక్తి ఎక్కువైన కారణం చేత, కొడుకును కన్న చోటనే పారేసి, భర్తతో విహరించ బోయింది.

బిడ్డ నోట్లో చెయ్యి దూర్చుకుని సన్నగా ఏడవసాగాడు. ఆ సమయంలో వృషభ వాహనంమీద పార్వతీ పరమేశ్వరులు ఆకాశ మార్గాన పోతూ ఆ పసిగుడ్డు ఏడుపు విన్నారు. ఆ దంపతులు ఆ శిశువును చూసి జాలిపడి, దగ్గిరికి వచ్చి చూశారు. పార్వతి సంతృప్తికోసం పరమేశ్వరు డా బిడ్డకు తల్లితో సమానమైన వయసూ, చిరంజీవిత్వమూ, ఆకాశంలో ఎగర గల ఒక పట్టణమూ ఇచ్చాడు. పార్వతీదేవి రాక్షసులకు సద్యోగర్భమూ, పుట్టగానే తల్లి వయసూ ఉండేలాగు వరమిచ్చింది.

పార్వతీ పరమేశ్వరుల వల్ల వరాలు పొందిన సుకేశుడనే ఆ రాక్షసుడు ఐశ్వర్యవంతుడై, ఆకాశగమనం గల పట్టణంలో విహరిస్తూ ఇంద్రుడికి సమానుడయాడు.

సుకేశుడు వరాలను పొందటమే గాక ధర్మాత్ముడని కూడా విని, గ్రామణి అనే గంధర్వుడు త్రిలోకసుందరి అయిన తన కుమార్తెను దేవవతి అనేదాన్ని తెచ్చి సుకేశుడి కిచ్చి పెళ్ళి చేశాడు. తన కంతటి భర్త దొరికినందుకు దేవవతి ఎంతో సంతోషించింది.



ఆ దంపతులకు మాల్యవంతుడూ, సుమాలీ, మాలీ అని ముగ్గురు కొడుకులు, మూడు అగ్నుల లాటి వారు కలిగారు. వారు మహా బలవంతులు, నిర్భయులు, అతి భయంకరులు. తమ తండ్రి శివుడి వల్ల వరాలు పొందినట్టు తెలిసి, వారు మేరుపర్వతానికి వెళ్ళి కఠోరమైన నియమాలతో అక్కడ తపస్సు సాగించారు. ఆ తపస్సుకు ముల్లోకాలూ అట్టుడికి పోయాయి. బ్రహ్మదేవుడు ఒకనాడు ఇంద్రాది దేవతలను వెంటబెట్టుకుని విమానం మీద వచ్చి, "మీ తపస్సుకు మెచ్చాను. ఏం వరాలు కావాలో కోరుకోండి," అన్నాడు.

"దేవా, నీకు మా పైన అనుగ్రహం కలిగిన పక్షంలో, మాకు ఎవరిచేతా ఓటమి కలగకుండానూ, మా చేతిలో శత్రువులంతా చచ్చేటట్టూ, మేము దీర్ఘాయుష్మంతులమై వర్ధిల్లేటట్టూ వరమియ్యి," అన్నారు వాళ్ళు. బ్రహ్మ వారి కలాగే వరమిచ్చాడు.

ఇటువంటి వరం పొంది ఆ ముగ్గురు రాక్షసులూ మూడు లోకాలనూ పీడించ సాగారు. దేవతలూ, ఋషులూ, సిద్ధులూ, సాధ్యులూ, చారణులూ మొదలైనవారికి జీవితం నరకమైపోయింది. వారిని కాపాడే నాధుడు లేడు.

ఆ రాక్షసులు విశ్వకర్మను పిలిపించి, "దేవతలందరికీ నీవే ఇళ్ళు కట్టావని విన్నాం. హిమాలయంమీద గాని, మేరు పర్వతం మీదగాని, మందరగిరి మీదగాని కైలాసానికి సరివచ్చేటటువంటి అందమైన పట్టణం మాకు కట్టి ఇయ్యి." అని అడిగారు.

"దక్షిణ సముద్ర తీరాన త్రికూటమనీ, సువేలమనీ రెండు పర్వతాలున్నాయి. త్రికూట పర్వతం యొక్క నడిమి శిఖరం మీద ఇంద్రుడి కోరికపైన లంకా పట్టణం కట్టి ఉంచాను. అది స్వర్గంతో సమానమైనది. బంగారు ప్రాకారాలూ, బంగారు తోరణాలూ కలది. మీరు మీ రాక్షసులతో

సహా వెళ్ళి అక్కడ ఉన్నట్టయితే మిమ్మల్ని ఎవరూ తేరి చూడలేరు,'' అని విశ్వకర్మ వారితో అన్నాడు.

విశ్వకర్మ చెప్పిన ఈ మాటలు విని ఆ రాక్షసులు చాలా సంతోషం చెంది, అనేక వేలమంది పరివారంతో సహా లంకకు చేరి, ఆ నగరాన్ని చూసి పరమానంద భరితులయారు. ఇదే సమయంలో నర్మద అనే గంధర్వ స్త్రీ చక్కని చుక్కల్లాటి తన కూతుళ్ళను ముగ్గురినీ తెచ్చి ఆ ముగ్గురన్నదమ్ములకూ పెళ్ళి చేసింది.

పెద్దవాడైన మాల్యవంతుడి భార్య సుందరి. కొంత కాలానికి సుందరి గర్భాన వజ్రముష్టి, విరూపాక్షుడూ, దుర్ముఖుడూ, సుప్తఘ్నుడూ, యజ్ఞకోపుడూ, మత్తుడూ, ఉన్మత్తుడూ అనే ఏడుగురు కొడుకులూ, ఎనిమిదవ సంతానంగా అనల అనే ఒక కూతురూ కలిగారు.

సుమాలి భార్య కేతుమతి. సుమాలికి ఆ భార్య అంటే ప్రాణంకన్న ఎక్కువ. కేతుమతికి ప్రహస్తుడూ, అకంపనుడూ, వికటుడూ, కాలకార్ముకుడూ, ధూమ్రాక్షుడూ, దండుడూ, సుపార్శ్వుడూ, సంహ్రాదీ, ప్రఘసుడూ, భాసకర్ణుడూ అనే కొడుకులూ, పుష్పోత్కటా, కైకసీ, శుచిస్మితా, కుంభీనసీ అనే కుమార్తెలూ కలిగారు.

మాలి భార్యకు అనిలుడూ, అనలుడూ, హరుడూ, సంపాతీ అనే నలుగురు కొడుకులు మాత్రమే కలిగారు. వీరు నలుగురూ, పెరిగి పెద్దవారై విభీషణుడికి మంత్రులయారు.

ఈ విధంగా ఆ ముగ్గురు రాక్షసులూ తమ పిల్లలతోనూ, పరివారంతోనూ లంకలో నివసిస్తూ, ఇంద్రాది దేవతలనూ, ఋషులనూ, నాగులనూ, దానవులనూ బాధిస్తూ, మూడు లోకాలలోనూ తమను నిగ్రహించేవాడు లేక వీరవిహారం చేస్తూ, చావు భయం కూడా లేకుండా, యజ్ఞాలను ధ్వంసం చేస్తూ, వరం పొందిన గర్వంతో తిరగసాగారు.



# పుడకలతో కూడా పోని బుద్ధి

బతికినన్నాళ్ళూ పాపయ్య, చిల్లర దొంగతనాలతో, చిన్న చిన్న అబద్ధాలతో, జనాన్ని మోసం చేస్తూ బతికాడు. చివరికతను చనిపోతే, యమభటులు అతణ్ణి నరకద్వారం దగ్గిర వదిలి వెళ్ళిపోయారు. అక్కడ చిన్న సింహాసనం లాటి దాని మీద, నరకద్వారపాలకుడు కూర్చుని వున్నాడు.

పాపయ్య, పుడకలతో కూడా పోని తన బుద్ధిని ప్రదర్శిస్తూ, ద్వారపాలకుడితో, "నా అయుష్షు తీరిందంటూ, యమభటులు నన్నిక్కడికి తీసుకువచ్చారు. నా పేరు గలవాళ్ళు, మా చిన్న ఊళ్ళోనే నలుగురున్నారు. ఎవరిని తెమ్మంటే, నన్ను తెచ్చారో! నా పూర్తిపేరు రుద్రబోయిన పాపయ్య. మా నాన్న పేరు రుద్రబోయిన భీమయ్య. తమరు, ఈ వివరాలు ఒకసారి చిత్రగుప్తుడి పుస్తకంలో తనిఖీ చేసి రాకూడదూ!" అన్నాడు.

పాపయ్య మాటలతో, నరకద్వారపాలకుడికి అనుమానం వచ్చి, తను కూర్చున్న ఆసనం వదిలి లోపలికిపోగానే, పాపయ్య దాన్ని నెత్తికెత్తుకుని, "ఇదేదో మంచి ఖరీదైనదిలాగే కనిపిస్తున్నది. దీన్ని కొనేవాళ్ళను, రెండో కంటికి తెలియకుండా వెతికి పట్టుకోవాలి!" అనుకుంటూ, అక్కడి నుంచి పరుగు ప్రారంభించాడు.

ఇంతలో అక్కడికి వచ్చిన చిత్రగుప్తుడు, ద్వారపాలకుడి చేత పావయ్యను పట్టించి, "మీ ఊళ్ళో ఎందరు పాపయ్యలున్నా, అందర్నీ మించిన మహా పాపి పాపయ్యవు, నువ్వే!" అన్నాడు.

—ఎం. డి. సౌజన్య





# అల్లరిదయ్యం

జయరామయ్య నేలమర్రి గ్రామంలో పెద్ద భూస్వామి. ఆయన ఒకనాటి రాత్రి వేళ, తన పడకగదిలో నిద్రపోతూ, అటక మీద పెద్ద చప్పుడవడంతో, ఉలిక్కిపడి నిద్రలేచాడు. ఆయన కళ్ళు నులుముకుని పైకి చూస్తే ఎవరూ కనిపించలేదు. కాని, అటక మీద మరొకసారి చప్పుడైంది.

''ఎవరూ?'' అని అరిచాడాయన. వెంటనే అటక మీది నుంచి ఒక దయ్యం ఆయన ముందు దూకింది.

దయ్యాన్ని చూసి జయరామయ్య వణికిపోతూ, ''ఎవరు నువ్వు?'' అన్నాడు.

ఆ ప్రశ్నకు దయ్యం విరగబడి నవ్వి, ''కనబడడం లేదా? నేను దయ్యాన్ని. ఇంట్లో అల్లరెక్కువగా వున్నదని, మా అమ్మ, నన్నెక్కడికైనాపోయి ఆడుకోమన్నది. ఈ ఇంటి అటక, ఆడుకోవడానికి చాలా బాగున్నది,'' అన్నది.

జయరామయ్య వెంటనే, ''శ్రీ ఆంజనేయం, ప్రసన్నాంజనేయం....'' అంటూ, ఆంజనేయదండకం ప్రారంభించాడు.

దయ్యం నవ్వి, ''చచ్చిపోయేముందు, మా ఇంట్లో కూడా అందరం ఆంజనేయ భక్తులం. నీ దండకం, మా మీద పని చెయ్యదు,'' అన్నది.

జయరామయ్యకు ఏం చేయాలో తెలియలేదు. ఆయన కాసేపాలోచించి, ''పొరుగింట్లో, ఇంకా పెద్ద అటక వున్నది. అక్కడికిపోయి ఆడుకో!'' అన్నాడు.

''నేను, నిన్నేమీ చేయను. నీ మానాన నువ్వు పడుకో; నా మానాన నేను ఆడుకుంటాను,'' అన్నది దయ్యం.

''సరే, నీ యిష్టం!'' అని జయరామయ్య తిరిగి పడుకున్నాడు. దయ్యం ఎగిరి అటక మీదికి పోయింది. ఆ తర్వాత ఒకటే చప్పుళ్ళు. జయరామయ్యకు నిద్ర

జొన్నలగడ్డ రామలక్ష్మి

పట్టలేదు. ఆయన ఎంత చెప్పినా, దయ్యం తన అల్లరి మానలేదు.

తెల్లవారుతూండగా దయ్యం, ఆయనతో, "నీ ఇల్లు చాలా బాగున్నది. ఆడుకోవడానికి రాత్రికి మళ్ళీ వస్తాను," అని చెప్పి వెళ్ళిపోయింది.

జయరామయ్యకు యాభై ఏళ్లుంటాయి. రెండేళ్ళక్రితం ఆయనకు భార్య పోయింది. ఒక్కడే కొడుకు; పేరు రఘుపతి. వాడికి పెళ్ళయింది. కోడలు జానకి, ఆయనను కన్న తండ్రి కన్న మిన్నగా ఆదరిస్తుంది.

దయ్యం వెళ్ళిపోగానే జయరామయ్య, కొడుకునూ, కోడలినీ పిలిచి, రాత్రి తనకు కలిగిన అనుభవం గురించి చెప్పాడు.

"దయ్యాలనేవి లేవు. నువ్వు భ్రమ పడి వుంటావు," అన్నాడు రఘుపతి.

"మామయ్యా, ఈ రాత్రికి మేము, మీ గదిలో పడుకుంటాం. మీరు మా గదిలో పడుకోండి," అన్నది కోడలు జానకి.

జయరామయ్య సంతోషంగా అందు కంగీకరించాడు. అయితే, ఆ రాత్రి ఆయనకు నిద్రపట్టబోయే సమయంలో, గదిలో పెద్ద చప్పుడై ఉలిక్కిపడి లేచాడు.

ఎదురుగా మళ్ళీ దయ్యం నిలబడి వుంది. అది జయరామయ్య కేసి కోపంగా చూస్తూ, "నేనే చప్పుడు చేసి, నిన్ను నిద్రలేపాను," అన్నది.



"ఎందుకోసం?" అన్నాడు జయరామయ్య విసుగ్గా.

"అటక గదిలో నువ్వే పడుకోవాలి. అప్పుడే నాకు ఆ గదిలో ఆడుకునేందుకు బావుంటుంది. వెంటనే వెళ్ళి, నీ వాళ్లను నిద్రలేపు. మీరు త్వరగా గదులు మారండి!" అన్నది దయ్యం ఆజ్ఞాపిస్తున్నట్టు.

"నేనిక్కడే పడుకుంటాను!" అన్నాడు జయరామయ్య బింకంగా.

"అలాగైతే, నేను ఊళ్ళోని చెత్త అంతా తెచ్చి, మీ ఇంట్లో పారేస్తాను. తెలిసిందా? నేను చెప్పినట్టు విను," అన్నది దయ్యం.

జయరామయ్య భయపడి, దయ్యం చెప్పినట్టే చేశాడు. కొడుకూ, కోడలూ ఆశ్చర్యపడుతూనే గది మారారు. ఆ రాత్రి కూడా దయ్యం అటక మీద పెద్ద చప్పుళ్ళు చేస్తూ ఆడుకున్నది. జయ రామయ్యకు కంటి మీద కునుకులేదు.

మర్నాడు ఉదయమే దయ్యం, మళ్ళీ రాత్రికి వస్తానని చెప్పి వెళ్ళిపోయింది. జయరామయ్య తనవాళ్ళను పిలిచి, రాత్రి జరిగింది చెప్పాడు.

''అంతా నీ భ్రమ, నాన్నా!'' అన్నాడు రఘుపతి.

''మామయ్యా, దయ్యం చెత్త తెచ్చి పోస్తే, నేను శుభ్రం చేస్తాగదా! మీరేమీ కంగారుపడకండి. అదేం చెప్పినా వినకుండా, మా గదిలోనే నిద్రపోండి,'' అన్నది జానకి.

జయరామయ్య సరేనన్నాడు. అయితే, ఆనాటి రాత్రివేళ దయ్యం వచ్చి, జయరామయ్యను మళ్ళీ బెదిరించింది. అయన లెక్క చెయ్యలేదు. ఇల్లంతా చెత్తతో నింపుతానంటే—నా కోడలు శుభ్రం చేస్తుందిలే పొమ్మన్నాడాయన.

అప్పుడు దయ్యం ఏదో తంత్రం ప్రయోగించి, జయరామయ్యను మరొక గదికి మార్చింది. తర్వాత జయరామయ్యలా తను వేషం మార్చుకునిపోయి, రఘుపతి వున్న గది తలుపు తట్టింది.

రఘుపతి నిద్రకళ్ళతో వచ్చి తలుపు తెరిచి, ''ఏమయింది, నాన్నా! దయ్యం



మళ్ళీ నిన్ను బెదిరించిందా ?'' అని అడిగాడు.

''అదేం లేదురా. అంతా నా భ్రమ! నాకీ అటక గదిలో తప్ప నిద్రపట్టేలా లేదు. మిమ్మల్ని యిబ్బంది పెడుతున్నానని ఏమీ అనుకోకు,'' అన్నది జయరామయ్య రూపంలో వున్న దయ్యం.

జయరామయ్య కొడుకూ, కోడలూ గది మారారు. అప్పుడు దయ్యం, జయరామయ్యను అటక వున్న గదిలోకి మార్చి, మళ్ళీ అల్లరి ప్రారంభించింది.

జయరామయ్య బెంబేలు పడిపోతూ, ''నన్నెందుకిలా వేధిస్తున్నావు? ఏం చేస్తే నన్ను వదిలిపెట్టి పోతావు?'' అని దయ్యాన్ని అడిగాడు.

''నేను, నీకేమీ హాని చేయనని ముందే చెప్పా గదా? నన్ను, యీ అటక మీద అడుకోనీ. నువ్వు మాత్రం, యీ గదిలోనే పడుకోవాలి,'' అన్నది దయ్యం.

''వెళ్ళి, నా కొడుకునూ, కోడలినీ పిలుచుకువస్తాను. వాళ్ళు నీకు తగిన బుద్ధి చెబుతారు,'' అన్నాడు జయరామయ్య.

''నీ వాళ్ళిక నీ మాట నమ్మరు!'' అని దయ్యం, అంతకు ముందు తానేం చేసిందీ ఆయనకు చెప్పింది.

జయరామయ్యకు మతిపోయినట్టయింది. ఆ రాత్రీ ఆయనకు నిద్ర లేదు. యథాప్రకారం మర్నాటి ఉదయం దయ్యం వెళ్ళిపోయింది. జయరామయ్య, దయ్యం విషయంలో ఏదో ఒకటి చేయా





లన్న దృఢ నిశ్చయానికి వచ్చాడు. సరిగ్గా అదే సమయంలో పొరుగూరు నుంచి, ఆయనకు కబురు వచ్చింది. బంధువుల ఇంట్లో పెండ్లి. జయరామయ్యను సకుటుంబంగా రమ్మన్నారు.

జయరామయ్య తన ఇంటికి కాపలాగా, ఒక రైతు కుటుంబాన్ని వుండమని చెప్పి, తాను సకుటుంబంగా పొరుగూరు వెళ్ళాడు. అనుకోకుండా వాళ్ళందరూ, అక్కడ రెండు వారాలకు పైగా వుండి పోవలసివచ్చింది.

ఆయన తిరిగి తన ఇల్లు చేరి రైతును, "ఇంట్లో సుఖంగా నిద్ర పట్టిందా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు రైతు ఆశ్చర్యపడుతూ, "అలా అడిగారేం! అటక గదిలో పడుకునేవాణ్ణి. అక్కడ వెచ్చగా ఎంతో బావుంది. వళ్ళు తెలియకుండా నిద్రపోయేవాణ్ణి." అని జవాబిచ్చాడు.

జయరామయ్య, వాణ్ణి మరేం ప్రశ్నించలేదు. ఆ రోజు నుంచీ దయ్యం ఆయన జోలికి రాలేదు.

ఒక వారం గడిచాక పొరుగింటామె జానకితో, "మా ఇంట్లో అటక మీద ఒక దయ్యం చేరి, రోజూ రాత్రివేళ తనకు నిద్ర లేకుండా చేస్తున్నదని, మా మామగారు గొడవ చేస్తున్నారు. అది మాకెవ్వరికీ కనబడడం లేదు. ఆయన భ్రమపడుతున్నారని, నా అనుమానం!" అన్నది.

జానకి ఆశ్చర్యపడి, "ఇలాంటి అనుభవమే, మా మామయ్యకూ కలిగింది. కాని, యిప్పుడాయన కా భ్రమ లేదు. అందు కాయన ఏం చేశారో, నాకు తెలియదు. మీ మామయ్య నొకసారి, ఆయనతో మాట్లాడమను." అని సలహాయిచ్చింది.

ఆ విధంగా పొరుగింటి సుబ్బరామయ్య వెళ్లి, జయరామయ్యను కలుసుకున్నాడు. తను చూసిన దయ్యాన్ని, మరొకరు కూడా చూసినందుకు జయరామయ్య చాలా సంతోషించి, "నీవీ, నావీ ఒకే

రకం అనుభవాలుగా వున్నవి. ఈ రాత్రి నేను, నీ ఇంటికి వచ్చి, ఆ దయ్యాన్ని చూస్తాను,'' అన్నాడు.

అన్న ప్రకారం ఆ రాత్రి జయ రామయ్య, సుబ్బరామయ్య ఇంటికి వెళ్ళాడు. రాత్రి రెండో జాము వేళ దయ్యం అక్కడికి వచ్చింది. జయ రామయ్యా, దయ్యం ఒకరినొకరు గుర్తించుకున్నారు.

''నువ్వు చెప్పింది నిజం! ఈ ఇంట్లో అటక చాలా పెద్దది. నీ ఇంటికంటే, నాకిక్కడే ఆడుకునేందుకు బావుంది,'' అన్నది దయ్యం.

''మరి, ఆ సంగతి ముందే చెప్పాగదా! అప్పుడే, నా గది ఎందుకు వదిలిపెట్టి వెళ్ళావు కాదు?'' అని అడిగాడు జయ రామయ్య.

''అటక మీద, నేనాడుకునేప్పుడు, విసుక్కునేందుకు మనిషి కావాలి. అప్పుడే నాకు ఆనందంగా వుంటుంది. నీ వున్న రోజుల్లో, నీ ఇంట్లో హాయిగా వున్నది. ఆ తర్వాత ఎవడో మొద్దు నిద్ర వాడొచ్చాడు. నేనెంత అల్లరి చేసినా వాడు కళ్ళు తెరిచేవాడుకాదు. దానితో విసిగి పోయి, నువ్వు, చెప్పిన, యీ పొరుగింటికి వచ్చాను. ఇక్కడ నాకు, నీ ఇంట్లో కన్న ఎంతో బావున్నది,'' అన్నది దయ్యం.

అసలు రహస్యం అప్పుడు జయ రామయ్యతోపాటు సుబ్బరామయ్య కూడా అర్థమైపోయింది. ఒళ్ళు తెలియ కుండా నిద్రపోవాలంటే కష్టపడి పని చేయాలి. అలాంటి వాళ్ళతో దయ్యానికి వినోదం వుండదు. తామిద్దరూ ఎంతో కాలంగా శరీరశ్రమ చెయ్యడం అన్నదే మరిచి, తిని కూర్చుంటున్నారు. అలాంటి వాళ్ళకు నిద్ర సరిగా పట్టకపోగా, చీమ చిటుక్కుమంటే మెలకువ వస్తుంది!

ఈ విషయం తెలిశాక, ఆ మర్నాటి నుంచీ జయరామయ్యా, సుబ్బరామయ్యా —ఇద్దరూ కూడా తమ శక్తికొలదీ తోట పని చేయడం ప్రారంభించారు. ఆ తర్వాత వాళ్ళనే దయ్యాలూ బాధించలేదు.



# రెండు నాల్కల కొత్వాలు

గోల్కొండ నగర పొలిమేరల్లో దిక్కులు పరికిస్తూ, ఒక దారీ తెన్నూ లేకుండా తిరుగుతున్న ఒక యువకుణ్ణి, శౌరినాథ్ అనే రక్షకభటుడు పట్టుకుని, "ఏయ్, ఎవరు నువ్వు? ఇక్కడేం చేస్తున్నావు?" అని గద్దిస్తూ అడిగాడు.

"మీ భాష నాకు తెలియదు, బాబయ్యా!" అన్నాడు యువకుడు.

కొత్వాలుకు, ఆ చుట్టుపక్కల గల రాజ్యాల్లోని భాషలన్నీ వచ్చు. శౌరినాథ్, యువకుణ్ణి అతడి దగ్గిరకు తీసుకుపోయి, సంగతి చెప్పి, "వీడు హమీద్‌పూర్‌లో, రత్నాలశెట్టిని చంపిన వాడులా వున్నాడు. నిజం చెప్పమనండి!" అన్నాడు.

కొత్వాలు కత్తి దూసి యువకుడి గుండెలకానించి, ప్రశ్నించగా, రత్నాలశెట్టిని చంపింది తానేనని యువకుడు ఒప్పుకున్నాడు.

ఈ సంగతి కొత్వాలు, శౌరినాథ్‌కు చెప్పగా, అతను, "అప్పుడు దొంగిలించిన ఇరవైవేల బంగారు కాసులు ఏం చేశాడో అడగండి," అన్నాడు.

కొత్వాలు ప్రశ్నకు యువకుడు, ఆ ధనాన్ని నగర పొలిమేరలోని ఒక కొండ గుహలో దాచినట్టు చెప్పి, దాని గుర్తులు తెలియబరిచి, "బాబయ్యా, ఆ ధనం మీరు తీసుకోండి నన్ను మాత్రం వదలండి! ముసలి తల్లిదండ్రుల పోషణభారం చూడవలసినవాణ్ణి," అన్నాడు.

రక్షకభటుడు శౌరినాథ్, కొత్వాలును యువకుడేం చెప్పాడని అడగగా, కొత్వాలు ఒక్క క్షణం తటపటాయించి, "శెట్టిని చంపి దొంగిలించిన బంగారు కాసుల్ని ఖర్చుపెట్టేశాడట. నీ చేతనైంది చేసుకో, ప్రాణం తీసినా ఖాతరు చెయ్యనంటున్నాడు. లాభం లేదు, ఈ మొండి వెధవను వదిలెయ్యి," అని చెప్పాడు.

ఇది వింటూనే యువకుడు, దుస్తుల్లో నుంచి ఒక పతకం తీసి, కొత్వాలుకు చూపాడు. దాన్ని చూస్తూనే, కొత్వాలు అదిరిపడ్డాడు. ఆ యువకుడు మారువేషంలో వున్న, నవాబు ముఖ్య సలహాదారు!

"నీ అవినీతి గురించిన ఫిర్యాదులు కొన్ని వచ్చినై, నిజానిజాలు తెలుసుకునేందుకు, ఈ నాటకం ఆడాను," అని నవాబు సలహాదారు, కొత్వాలును కోటకేసి నడిపించాడు.

—యం. పి. శ్రావణకుమార్





# వేదవాక్కు

అనగనగా ఒక రాజు. మారువేషంతో తిరిగి, ప్రజల స్థితిగతులు స్వయంగా తెలుసుకోవటం అయనకు సరదా. అందుకనే మంత్రిని వెంటబెట్టుకుని, ఊరూరా సంచారం చేస్తూ వుండేవాడు.

ఒకప్పుడు వారిద్దరూ పోయిపోయి, మిట్టమధ్యాహ్న మయేసరికల్లా, దూరాన వుండే ఒక గ్రామం చేరుకొన్నారు. ఆ గ్రామంలో ఒక ఇంటి ముందు వారికి ఒకాయన కనిపించాడు. ఆయన నిమ్మ పండు వంటి చాయ గలవాడు, ఇరవయ్యేళ్ళ ప్రాయంవాడు, వయసుకు తగ్గ ఒడ్డూ పొడవూ గలవాడు.

భూతబలి వేయటానికని ఆయన అప్పుడే ఇవతలికి వచ్చి నిలబడ్డాడు. రాజూ మంత్రీ వెళ్లి ఆయనను సమీపించి పలకరించి, పుట్టుపూర్వోత్తరాలన్నీ కనుక్కున్నారు.

ఆ వ్యక్తి తన పేరు మిహిరు డని చెబుతూ, వారికి ఆతిథ్యమిచ్చాడు. వారు ఇష్టాగోష్ఠి చేస్తూ వుండగా, మిహిరుడు గొప్ప జ్యోతిష్కుడనే విషయం రాజుకు వెల్లడయింది.

ఆ గొప్పదనం ఏమిటో పరీక్షిద్దామని రాజు, "స్వామీ! మేము వర్తకులం. వ్యాపార విషయంలో దేశసంచారం బయల్దేరాము. మేం తలపెట్టిన వర్తకం లాభిస్తుందా, లేదా? ప్రారంభించటానికి ఎప్పుడు బాగా వుంటుంది? సెలవియ్యండి." అని కోరాడు.

వెంటనే మిహిరుడు, "అయ్యా, మీరిద్దరూ జాతివర్తకులు కారు. మారు వేషంలో ఉన్న క్షత్రియులు. మీరు 'ఫలానా' వారైవుంటారనటానికి సందేహమేమీ లేదు," అని చెప్పేసరికి వారు అమితాశ్చర్యం పొందారు. తరువాత



రాజు, మిహిరుణ్ణి తమ ఆస్థానంలో పెట్టుకున్నాడు.

ఇలా వుండగా—లేక లేక చాలా కాలానికి, రాజుకు ఒక కుమారుడు కలిగాడు. శిశువు జాతకం తయారు చేయవలసిందని ఆస్థాన జ్యోతిష్కులందరికీ రాజాజ్ఞ అయింది. ఆ జ్యోతిష్కులందరూ తమ యావచ్ఛక్తినీ, జ్ఞానాన్నీ వినియోగించి, అతి శ్రద్ధతో రాజకుమారుడి జాతకం సిద్ధపరిచారు.

పని పూర్తి కాగానే, రాజు దర్బారు చేశాడు. ఆ సభలో అందరూ కూడా, "రాజకుమారుని జాతకం చాలా దివ్యంగా వున్నది. ఐతే ఇరవయ్యో ఏట మాత్రం అందులో ఒక చిన్న గండం కనిపిస్తున్నది. కానీ, అది ఏపాటి?—ఇట్టె దాటెయ్యవచ్చు." అంటూ ఏకగ్రీవంగా చెప్పారు.

అయితే, మిహిరుడు మాత్రం, "ఆ బాలుడు ఇరవయ్యో ఏట ఫలానా రోజున అయిదున్నర గంటలకు అడవిపంది మూలంగా తప్పక మరణిస్తాడు," అని జంకుకొంకులు లేకుండా చెప్పాడు.

రాజకుమారుడికి బాల్యం దాటింది. జ్యోతిష్కుల మాటలు జ్ఞాపకం రాగా, అప్పటినుండి రాజు మనస్సు కలవరపడజొచ్చింది.

అటు సూర్యుడు ఇటు పొడిచినప్పటికీ, మిహిరుడి నోటి వాక్యానికి తిరుగులేదని రాజుకు బాగా తెలుసు. కనుక, కుమారుడి విషయంలో ఉపేక్ష చేయటానికి ఎంత మాత్రమూ వీలు లేదనుకొన్నాడు.

పోతే—దైవవిధికి అడ్డుపెట్టే శక్తి ఎంత మాత్రమూ మానవునికి లేదు. ఐనా, ప్రయత్నం చేసి కుమారునకు అడవి పంది మూలంగా వచ్చే గండం తప్పింప చూదామని రాజుకు బుద్ధి పుట్టింది.

ఈ ఉద్దేశంతో నగరానికి దూరాన ఏడంతస్థుల మేడ కట్టించి, చుట్టూ ఎత్తయిన గోడలు ఆవరణగా పెట్టించి, చీమలు దూరటానికైనా వీలుకానంత బందోబస్తు చేయించాడు.

సమస్త సదుపాయాలూ ఆ మేడలోనే జరగటానికి యేర్పాటు చేసి, సహపాఠులతో సహా తన కుమారుణ్ణి దానిలో ప్రవేశపెట్టించాడు. వాళ్ళు ఎవళ్ళూ మేడ విడిచి చుట్టుపక్కల వనాలలోకి విహారం వెళ్ళకుండా కట్టడి చేశాడు. ఇన్నీ చేసి, తను అప్పుడప్పుడు వచ్చిపోతూ చూస్తూ వుండేవాడు.

ఇలా వుండగా—గండకాలం సమీపించింది. జ్యోతిష్కులు పెట్టిన గడువు ఇక ఒకటి రెండు రోజులే వున్నది. అప్పుడు రాజు సైనికులతో ఇదివరకు కంటె కూడా చాలా జాగర్తగా వుండమని హెచ్చరిక చేశాడు. గండ దినమునాడు సూర్యోదయం మొదలు ప్రతిక్షణమూ కుమారుని ఆరోగ్యం తనకు తెలపటానికని రాజు వేగులను ఏర్పాటు చేశాడు.

మధ్యాహ్నం మూడు గంటలయ్యే వరకూ వేగులు ఒకరి వెనుక ఒకరు వచ్చి, రాజకుమారుడు ఉత్సాహంగానే ఉన్నాడని చెబుతూ వచ్చారు. రాజు కొలువు తీర్చి పండితగోష్ఠి జరుపుతున్నాడు.

సభలోవారు అందరూ, మిహిరుడు లెక్కలు వేయటంలో ఏదో పొరపడి వుంటాడనీ, ఆయన మాట పొల్లు అయితే రాజుకు తప్పక ఆగ్రహం కలుగుతుందనీ భయపడసాగారు. ఇంతలో ఐదు గంటలైంది. సభలో వారందరితో సహా రాజు కుమారుని చూడటానికని బయల్దేరాడు.



దారిలో ఒక బంటు ఎదురై, కుమారుడు బాగానే ఉన్నాడనీ, చక్కగా ఆడుకుంటున్నాడనీ రాజుతో చెప్పాడు. ఇదేమిటన్నట్టు అందరూ ఒక్కసారిగా మిహిరుని వంక చూశారు.

అంతమాత్రానికే మిహిరుడు బెదరలేదు. "నా జోస్యం తప్పదు," అన్నాడు. రాజు, కుమారుడు వుండే నగరు ప్రవేశించి, భోగట్టా చేయగా, అతడు నాలుగో అంతస్థు మీద వున్నాడని సేవకులు చెప్పారు. అక్కడికి పోయి చూస్తే, గాలికోసం డాబామీదికి వెళ్ళాడన్నారు.

మిహిరుని వంక చూశాడు రాజు. అందుకు మిహిరుడు, "రాకుమారుడు ఈ లోకం వదలి అప్పుడే అరగంట సేపయింది," అని నొక్కి చెప్పాడు.

దడదడ కొట్టుకొంటున్న గుండెలతో అందరూ వేగంగా యేడవ అంతస్థు ఎక్కుతున్నారు. ఇంత యెత్తుకు అడవి పంది యెలా ఎక్క గలుగుతుందా అని అందరికీ బలమైన సందేహం పట్టుకున్నది. తీరా డాబా ఎక్కి చూసేసరికి, ఒక జెండా స్తంభం కింద, మంచం పైన—రొమ్ము మీద భారమైన ఇనుప వరాహ విగ్రహం పడి—నెత్తురు లోడుతున్న శరీరంతో, రాకుమారుడు కనిపించాడు! పుత్రశోకం భరించలేక అపరిమితంగా విలపించాడు రాజు.

"ఈ నగరు నిర్మించినప్పుడు, శిల్పి ఈ విగ్రహాన్ని జెండా స్తంభం మీద నిలిపి వుంటాడు. కుతూహలం కొద్దీ బిడ్డడు దీనిని లాగి వుంటాడు. దాని ఫలితమే ఇది. వరాహమూర్తి మా ఇలువేలుపు అయివున్నాడు. మా కులదైవమే ఈ విధంగా నా బిడ్డడిని తనలో ఐక్యం చేసుకొన్నాడు. యేది యేమన్నా, శాస్త్రం తప్పదు!" అని అందరికీ రాజు తెలియజెప్పాడు.

రాజు అప్పుడు మిహిరుణ్ణి కౌగిలించుకొని, అతణ్ణి ఎంతగానో గౌరవించి, 'వరాహమిహిరు' డనే బిరుదు ప్రసాదించాడు.





## రంగులు మార్చే చేప!

ఫైల్‌ఫిష్ అనే చేప, అపాయం రానున్నదని తెలియగానే, పరిసరాలకు తగిన రంగులో మారిపోతుంది. పైగా అది తలకిందులుగా తిరిగిపోయి, సముద్రపు నాచులాగానూ, గడ్డి పోచలులాగానూ కనిపించడంవల్ల, దానిని పసిగట్టడం సులభంకాదు.



## మట్టిగూడు కట్టుకునే పక్షి!

దక్షిణ అమెరికాలోనూ, మధ్య అమెరికాలోనూ నివసించే ఓవెన్ బర్డ్ అనే పక్షి, తేమగల బంకమన్నుతో గూడు కట్టుకుంటుంది. ఆ గూడు ఎండకు గట్టిపడి దృఢంగా తయారవుతుంది.

## చెట్లపై కప్పలు

ప్రపంచం మొత్తంమీద దాదాపు 500 రకాల కప్పలు చెట్ల పైకి ప్రాకగలవు. ఈ కప్పల వేళ్ళ కొనలు కాస్త వంకరగా తిరిగి ఉండడంవల్ల అవి సులభంగా కొమ్మలనూ, రెమ్మలనూ, ఆకులనూ ఒడిసి పట్టుకోగలుగుతున్నాయి.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1986 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



D. Mangal

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అగస్టు నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ. పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: శ్రమజీవన సౌందర్యం     రెండవ ఫోటో: సుఖజీవన సుకుమారం

పంపినవారు: మండలి రవీంద్రమోహన్, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాదు-660

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 30-00

చందా పంపవలసిన చిరునామా:

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

ఇతర దేశాల చందా వివరాలకు రాయండి:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026.

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.



"నాకు తెలుసు... చిన్న-చిన్న పళ్ల రాక్షసులు నా పళ్లలో కన్నాలు చేస్తాయి.

ఎందుకంటే, మా అమ్మ నాకు విడమర్చి చెప్పిందిగా! అవి నిజంగా 'బ్యాక్టీరియా' అట, అవి నోట్లో మిగిలిపోయిన అన్నం ముక్కలతో కలిసి 'ఆమ్లాల'ను పూరించి 'పంటి ఎనామిల్'పై దాడి చేసి కన్నాలు అంటే 'పుప్పిపళ్లు' చేస్తాయి.



కాని నా పళ్లు పాడవవని నాకు తెలుసు. ఎందుకంటే నా దగ్గర వుందిగా

## నా సూపర్ ఫైటర్!

## ఫోర్‌హెన్స్ ఫ్లోరైడ్... దీని సహాయంతో పుప్పిపళ్లతో పోరాడ్తా. గెలిచేస్తా!




నా సూపర్ ఫైటర్‌లోని ఫ్లోరైడ్ నా 'పంటి ఎనామిల్'ను గట్టి చేసి, నొప్పి కల్గించే పుప్పిపళ్లు కాకుండా చేస్తుంది.

మా అమ్మ ఎంత మంచిదో. రుచికరమైన, నురుగునిచ్చే నా సూపర్ ఫైటర్ గురించి నాకంతా నేర్పింది."

ఆకర్షణీయమైన క్రొత్త ప్యాక్‌లో!






ఫోర్‌హెన్స్ ఫ్లోరైడ్
పుప్పిపళ్లను ఎదుర్కొనే సూపర్ ఫైటర్!

429-GM-203 TEL